శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః

శ్రీ

నిర్వచన

# సుందరకాండము







-: రచయిత :-


తిరుమల వింజమూరు పార్థసారథిఅయ్యంగార్

కొవ్వూరు, పశ్చిమగోదావరిజిల్లా.


 1949 వెల 0-12-0

శ్రీ

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

నిర్వచన

# సుందరకాండము





-: రచయిత :-

తిరుమల వింజమూరు పార్థసారథిఅయ్యంగార్

కొవ్వూరు, పశ్చిమగోదావరిజిల్లా

1949 వెల 0 10 0

శా. ద్రాక్షాపాకము పార్థసారథికి మోదంబయ్యెఁ గాఁబోలు నా
మిక్షుం బాలును బెర్గుమీఁగడలు పేర్మిన్ మెక్కుటల్ మాని ప్ర
త్యక్షంబుంబొనరించె సుందరకృతిం దామాధురగ్రామముక్ష
వీక్షింపంగలఁడై కనుంగొని వయోవిద్యావిశేషస్థితుల్;

ఉ. కాండములందు సుందరముఁగాంచి పఠించిన సర్వసంపదల్
మెండగునంచుఁ జెప్పెదరు మిక్కిలివారలు, సుందరాఖ్య నా
కాఁడము నీవుచేసితివి కమ్మనలిమ్మహిఁ గ్రుమ్మరింప నీ
దండవసించి రాముఁడు ముదంబున నిన్ గనుఁ బార్థసారథీ!

సుదర్శన భవనము
రాజమహేంద్రవరము
15-7-48

(Sd) శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

★ ★

శ్రీ తిరుమల వింజమూరి పార్థసారథిగారు రచియించిన రామాయణము సుందరకాండమనుగ్రంథము, వారిగురువులగు శ్రీయుత వాజపేయయాజుల రామసుబ్బరాయకవిగారి ద్వారాచూచి కొంతభాగము స్థాలీపులాకముగాఁ జదివినాను. రామాయణకథ నెందఱెన్నిరీతుల వ్రాసినను అది లోకమునకు మహోపకారమే. ముఖ్యముగా నీదినములలో శ్రీరాముని జీవితకథ హైందవయువకుల హృదయములందు నాటునట్లు చేయవలసిన యావశ్యకత యెంతేనియుఁగానవచ్చుచున్నది. శ్రీపార్థసారథి గారి రచన మృదుమధురమై ధారాళమై సర్వజనామోదమును బొందఁదగియున్నది. వీరి యీగ్రంథము విశేషవ్యాప్తిలోనికివచ్చి వీరిట్టిగ్రంథము లనేకమింకను రచింపఁగల్గుదురుగాక యని యాసించుచున్నాను.

మద్రాసు
7-5-1948

(sd) కోరాడరామకృష్ణయ్య. M A

శ్రీ అవధానిశిరోమణి, విద్యావారిధి బ్రహ్మశ్రీ కాశీ కృష్ణాచార్యులుగారి యభిప్రాయము.

క. సుందరము రామచరితమె
సుందరకాండం బెయందు సుందరతర, మా
సుందరకాండమె నీకృతి
సుందరతమమయ్యె బాలసుకవి వతంసా!

గుంటూరు
18-10-49

(Sd) కా॥ కృష్ణాచార్యులు.

★ ★

శ్రీ శతావధాని దూపాటి వేంకట రమణాచార్యులుగారి యభిప్రాయము.

క. బిఱుసెఱుఁగని ధారయు న
చ్చెరువగు దృష్టాంతములును జిలిబిలినుడులున్
గఱఁగించె నామనంబును
సరసమునీకవిత పార్థసారథిసుకవి!

కరీంనగరము
3-9-1946

(sd) దూ. వేంకటరమణాచార్యులు
(శేషాద్రిరమణకవులు)

★ ★

పార్థసారధిగారి కవితాధార నిరాతంకముగను మధురమధురముగను బోకడ సరససరళముగను వెలసి ముద్దులుగొల్పుచు సహృదయ వినోదకరముగనున్నది. వాగ్దేవత యీయభివృద్ధికాముని రుచిరమువిశుద్ధ వాగర్థసమృద్ధియు నిష్టదైవ మీబుద్ధిశాలికిఁ జిరాయురభ్యుదయాభివృద్ధియుఁ గటాక్షించుచు నితనిని స్వీయచరణారాధన ధన్యుం గావింతురు గాత.

గుంటూరు
31-8-46

(Sd) చతుర్వేదుల అమరేశ్వరశాస్త్రి
[కవి బ్రహ్మ]

# అభిప్రాయము



మ. కవిరాజుల్ కవిసార్వభౌములు శిరఃకంపంబుఁగావింప, స
త్కవి పంచాననులబ్బురంపడుచు ప్రస్తావించి శ్లాఘింపఁగా
వ్యవిలాసామృత వాహినీలహరిసమ్యగ్వైఖరింగూర్చి సం
స్తవనీయంబగు కైత నల్లితివి ప్రజ్ఞాచాతురీ మాధురిన్.

(sd) కో. కం. అ. సంపత్కుమారాచార్యు
కొల్లాపురం




ఉ. బాలుఁడవయ్యు నీదుపరిపక్వ కవిత్వమహత్వమెన్నఁగాఁ
జాలఁ బ్రశస్తమై సరసజాలసమన్వితమై మనోహరం
బై లలితంబునై మిగులహర్షముఁగూర్చు బహూక్తులేల? గో
పాలుని సత్కృపాకలన వర్ధిలుమెప్పుడు పార్థసారథీ!

(sd) గం. వేం. నరసింహాచార్యులు
కొల్లాపురం

—oOo—

# కృతజ్ఞత

—oOo—

శ్లో. యదిక్షుణ్ణం పూర్వైరితిజహాతి రామస్యచరితమ్
గుణైరేతావద్భిర్జయతి పునరన్యో జగతికః
స్వమాత్మానమ్ తత్తద్గుణగరిమగంభీరమధుర
స్ఫురద్వాగ్బ్రహ్మాణః కథముపకరిష్యంతి కవయః

మురారి.

పాఠక మహాశయులారా !

శ్రీమంతంబగు నీభరతఖండంబున ననన్యాదృశసుగుణ గంభీరుండగు శ్రీరామచంద్రమూర్తికథను వాల్మీకి యాజ్ఞవల్క్యాది మహామునులును, జయదేవరంగనాథాది మహాకవులును, త్యాగరాజాది మహాభక్తశిఖామణులును, యింక ననేకమహాత్ములు బహుభాషల బహువిధముల బహురమ్యంబుగవ్రాసియుండ నేనదే కథాంశము నేలవ్రాయవలెనన్న లోకుల శంకకు పైమహాకవి శ్లోకమెంతయు సమాధానమిచ్చునని నావిశ్వాసము. అదియునుంగాక "రామచరిత్రవ్రాసి వ్రా, లాయము నామనంబును కలంబు బవిత్రముజేసికొందు" అని మున్నేవ్రాసిన నాభక్తిభావంబును దీనికిబీజంబగునని యార్యులూహింపకపోరు. ఏతద్గ్రంథరచనాప్రోత్సాహమునకు మూలాధారులైన మద్గురువులు వాజపేయయాజుల రామసుబ్బరాయకవి మూర్ధన్యులు మిక్కిలివందనీయులు. వారి కవితాగుణంబెన్నఁడు దీర్పరానిది. నాపైఁగల వాత్సల్యముచే వారింత తోఁగాక మత్కృతికి విపులమైన పీఠిక వ్రాసి పన్నిపెట్టినందులకు కృతజ్ఞతాపూర్వక వందనంబు లర్పించుచున్నాను.

ఇంకనన్ను చిన్ననాఁటినుండియు నాజననితోఁపా టత్యంతప్రేమం బునఁబెంచి పెద్దఁజేసి మత్కవితయెడఁగల్గిన యెక్కువమక్కువచే నేతత్పవిత్రకావ్యముఁ దనపేరఁ బ్రచురింపఁ బ్రోత్సహించిన నితాంతజ్ఞానవారాశి, పరమసాధ్వి, మన్మాతామహి కందాడై తిరువేంగడమ్మాళ్ గారు, మిక్కిలి గణనీయురాలు. వారికి నాపట్లఁగల్గిన ప్రేమ వివరింపరానిది. నిక్కముఁజెప్పుచో వారికిఁగలిగినంత భాషాజ్ఞానంబుకల యోషిద్రత్నంబులును వారు చదివినన్ని గ్రంథములు, అన్నిమార్లు చదివిన విదుషీమణులు నాంధ్రప్రపంచంబున నరుదని చెప్పుటకెంతయు సాహసించుచున్నాను.

వారు జీవించినకాలములో నీకావ్యము ప్రచురింపఁబడకపోవుట చింత్యము. అయినను వారి యాశయమును శిరసావహించి యీపవిత్రకావ్యముఁ బ్రచురించి మాతృఋణంబుదీర్చిన, వారికుమారులును నాకు మామగారునగు శ్రీ కందాడై శ్రీనివాసరంగనాథస్వామిగారెంతయుఁ బ్రశంసనీయులు. వారికే తత్కృతినాథుఁడైన శ్రీరామచంద్రమూర్తి యనంత యశస్సంపత్సమృద్ధియు, నాయురారోగ్య పుత్రసంతానాభివృద్ధియుఁ బ్రసాదించుఁగాకయని ప్రార్థించుచున్నాను.

ఇట్లు
గ్రంథకర్త.



శ్రీమత్పరదేవతాయైనమః.

# తొలిపలుకు

ఉ. రామపదారవింద మకరందములానెడు భాగ్యశాలికిన్
రామపదారవింద భజనంబును సల్పెడు పుణ్యరాశికిన్
రామకథాసుధారసముఁ ద్రావుచునుండెడు భక్తకోటికిన్
రాముఁడొసంగు సౌఖ్యము నిరామయజీవితమెల్ల భంగులన్.

సిరిసంపదల కాలవాలమై, సకల విభవాభిరామంబై, వీరనాయకులకు స్థానంబై, మహామునిగణంబున కావాసంబై తనరారు మనభరతఖండంబునమహాకవులెందఱో తమకావ్యరూపమున నేఁటికిని లోచనగోచరంబులగు చున్నవారు. అందాది కావ్యంబగు రామాయణమునకున్న వ్యాప్తి, కీర్తి, విస్ఫూర్తియిట్టిదట్టిదని వర్ణింపనలవి కానిది—

రామకావ్యమును వ్రాయనికవిగాని రామకీర్తనలను పాడని గాయకుఁడుగాని రామనామస్మరణముఁ జేయని భాగవతుఁడుగాని రామప్రతిమను చిత్రింపని చిత్రకారుఁడుగాని రామవిగ్రహమును పూజింపని ఆస్తికుఁడుగాని రామబ్రహ్మమును ధ్యానింపని యోగిగాని రామలింగమును స్థాపింపని భక్తుఁడుగాని మనదేశంబునఁగానరాఁడనుట నిక్కువంబు— అంతయు రామమయమే— వేయేటికి? శ్రీరామనామస్మరణరసము ప్రతిభారతీయుని రక్తనాళములోఁ జేరిపోయినది. రామనామము తారకమంత్రమైనది.

ఈ శ్యామసుందరమూర్తి దివ్యకథాసారమే శ్రీమద్రామాయణ మహాకావ్యవతంసము. కథానాయకుఁడు సకలసద్గుణపారిజాతమగు శ్రీరాముఁడే. పరమసాధ్వియగు సీతామహాదేవి స్త్రీజనంబులలోన మేలుబంతి. భరతుని నిష్కళంక మహాత్యాగమును లక్ష్మణుని భ్రాతృ

భక్తిస్వరూపమును గణనీయములు. సీతారాముల సేవింపనెంచి కష్టములభరించిన సౌజన్యసముద్రము లక్ష్మణమూర్తి.

ఇంతటి వీరపురుషులదివ్యచారిత్రమును వివిధరూపములఁ బ్రకటించి భరతఖండమునకు వీరపూజాసందర్భమున నగ్రతాంబూలమిచ్చిన కవి సత్తములు త్రిభువనవంద్యులు.

ఈ కావ్యమును సౌరభాషలో వ్రాసి వల్మీకసంభవుఁడు పద్మసంభవ ప్రతిమానుఁడయ్యె. అనేకభాషలలో నీగ్రంథము పరివర్తనము చేయఁబడినది. శ్రీతులసీదాసమహాకవి హిందీ భాషలో వ్రాసి శాశ్వతకీర్తిని సంపాదించెను. ఆంధ్రసారస్వత ప్రపంచమునఁ గ్రమక్రమముగ నెన్నియో రామాయణములు వెలసినవి. ప్రాక్కవులమార్గమునకు నేటికిని కవియైనవాఁడు రామకథనువ్రాయుచుఁ దదాచారసాంప్రదాయములను నిలబెట్టుచున్నవాఁడు. అందు సుందరకాండము కాండములపైకి మణివంటిది. కాన యీకవిహృదయము సుందరకాండము నాకర్షించినది–

## గ్రం థ ప్ర యో జ న ము

శ్రీరాముని చారిత్రమును బెక్కురు కవిపుంగవులు కావ్యనాటకశతకరూపముల రచించియుండ నిప్పుడీగ్రంథము వలని ప్రయోజనమేమి యని నిరసింపవలదు. మోక్షసాధనములలో భక్తియే ప్రథమసాధనమని వ్యాసాదు లుద్ఘోషించుటంజేసి భక్తిరసపరిపూర్ణమగు నీకావ్యము ముముక్షుజనులకెల్ల మార్గదర్శకమై భక్తినిఁ బెంపొందించెడిని. మఱియు "రాఘవేశ్వరు చారిత్రము నెవ్వరెన్ని గతులఁ వ్రాసిన క్రొత్తదే?" అనునార్యోక్తు లభినందనీయములు.

"జానకీ, జానికథల్ రచింపక యసత్కథ లెన్ని రచించె నేనియున్
వానివివేక మేమిటికి వానికవిత్వ మహత్త్వమేటికిన్"

అనుకంకంటి పాపనార్యుని వాక్యముపైఁ బ్రధానలక్ష్యముంచి నన్ను నమ్ముకొని కవిత్వము వ్రాయుచున్న యీయువకుని, యీగ్రాశిష్యమణిని

యీభక్తుని యికావ్యమునకై ప్రోత్సహించితిని. అంతలో నామాట పై లక్ష్యముంచి దీక్షవహించి శ్రద్ధాభక్తులతో సీకావ్యమును బూర్తి చేసి నామనమున్ ఋణముక్తి దీర్చిన శిష్యరత్నమని దీవించి యీతోలి పలుకునుగూర్చి పాఠకలోకమునకుఁ బరిచయముజేసి యీతనియభివృద్ధికై మహాకవుల దీవన లాసించుచుంటి.

## క వి త్వ త త్త్వ ము

ఇందు శైలిమధురముగనున్నది. వినువారి వీనులు నమృతంపు సోన లోలుకురీతిఁ దేటతెల్లమగు మాటలతో భావము విశదీకరింపఁబడినది. వలుతావులందీకవిపసందులగు పలుకుల నుపయోగించి మృదుపద సంపదతోఁ జక్కని ధారాశుద్ధితో మనోరంజకముగ నుండునట్లు రచించియున్నాఁడు.

## క వ న ధా ర

ఈకిందివంక్తులలోఁ కవిత్వము కడు ధారాళమై చక్కనిశైలితో నడచుచున్నది.

ఉ. ప్రాపితకీర్తిశాలి ప్రతిభాజితదివ్యగురూత్తముఁడు, మా
తాపితృభక్తితత్పరుఁడు ధర్మవధానుచరుండు సత్యభా
షాపరశేషమూర్తి శరణాగత సజ్జనరక్షకుండు దీ
క్షాపరతంత్రుఁడన్యజలజాత ముఖీవిముఖుండు మానినీ!

చ. వరమహిఁబుట్టితిన్ ధరణివంశముఁ జొచ్చితినంచు భూమిభృ
ద్వరుఁడు మహోల్బ్ణాదశరథ ప్రభువర్యుని కోడలైతి ని
ర్జరపరిసేవ్యుఁడైన రఘురామునకున్ సతినైతి నోవనే
చరకులదీప! యిన్నిఁటఁ బ్రశస్తికి నెక్కిన దాననైతిమున్.

ఉ. ఏను పతివ్రతామణినయేని రఘూద్వహు పాదపంకజ
ధ్యానముభక్తితోడ సతతంబును సేయుదునేని నాతఁడం
భోనిధిదాటివచ్చినను బ్రోచుటనిక్కమయేని యిమ్మరు
త్సూనున కగ్నికీలలను సోకఁగనీయకు హవ్యవాహనా.

చ. వననిధిదాటుటల్ సురసభామినిగెల్చుట సింహికాసురన్
దునుముట లంకఁజొచ్చుట వధూమణి జానకిఁగాంచి పల్కుటల్
వనమును ద్రుంచుటల్ దనుజవర్గముఁజంపి దశాస్యుదూఱుటల్
పెనుపుగ లంకనగ్గిదపలించుటలాదిగ విస్తరింపఁగన్.

ఉ. అమ్ములఁద్రుంచి శత్రునిచయమ్ములనెల్లఁదోలించి సైనికా
యమ్ముల వ్రక్కలించి గనయమ్ములఁజించి యలంచి దుఃఖితో
యమ్ముల సర్వదానవచయమ్ములముంచి మరుత్సుతుండు సై
న్యమ్ములనెల్ల నొంచెననయమ్ముల సన్మహిమాభిరాముఁడై.

## మా తృ కా వి స్తృ తి

ఈతని కవితారస మొక్కెడ నక్కడక్కడ మూలగ్రంథము నందలి మాధుర్యమును వెల్లివిరియించి విస్తరించి మాతృకకుంగూడ మెఱుంగులు వెట్టుచున్నట్లు వన్నెలు చిన్నెలు తీర్చినట్లు కనుఁబట్టగలదని కవితారసాస్వాదనతత్పరులెఱింగి యిక్కనివిమర్శించి దీవించకపోరు

## క వి తా ప్రా రం భ ము

పదునాఱేండ్ల ప్రాయమునుండియుఁ జక్కనికవిత్వము వ్రాయునలవాటును గాంచినయతఁడీయువకుఁడు. ఆంగ్లమునఁ బ్రవేశపరీక్షయందుత్తీర్ణుఁడై, ఉర్దు, హిందీ భాషలయందునిపుణుఁడై, యంతటితో దృప్తిపడక మాతృభాషకై కలమందుకొని పెద్దల యాశీర్వాదబలముచేఁ బంచతంత్రమును బూర్తిగరచించి యీవల యీప్రయత్న మొనరించె.

నాకుంగూచ్చ శిష్యమణియగుట నేనెక్కుడుగఁ జెప్పరాదు కాని యాశువుగఁ బద్యములు చెప్పుటయందు, మనోహరముగఁ జదువుటయందు ముద్దులు మూటగట్టునట్లు చక్కఁగ వ్రాయుటయందీకవి చిన్ననాటనుండియు నేర్పుగడించె. వేయేల? కవితాప్రపంచమున కీకవి వర్ధమానచంద్రుఁడు - రామభక్తిపరాయణుఁడు - సద్వంశసంజాతుఁడు - ప్రాచీన సాంప్రదాయములం దాసక్తిఁగలవాఁడు - కాననే యిట్టిప్రయత్నమునకుఁ గలముందుకొని కృతార్థుఁడయ్యె. ఇట్టి భక్తిరసప్రధానములగు కావ్యములే దేశసౌభాగ్యనిదానములు - ఇట్టివే నాగరకతా చిహ్నములు, - ఇట్టివే సకలధర్మప్రతిష్ఠాపకములు - ఇట్టివే భవపారావార సంతారణతరణులు - ఇట్టివే జీవన్ముక్తి మహాసౌధాగ్రసోపానములు - ఇట్టివే సకలపురుషార్థక సాధకములు.

## గ్రంథప్రకటనము

శ్రీమాన్ కందాడై శ్రీనివాసరంగనాథస్వామి గారీకవికి వారి పుత్రికారత్నమిచ్చినవారు, తెలుఁగు కావ్యములందత్యంతాభిమానముగలవారు. వీరి తల్లిగారగు తిరువేంగడమ్మాళ్ గారను సాధ్వీరత్నముత్తమ కావ్యప్రబంధ నాటకములనన్నియుఁ జదివిన జ్ఞానగుణాధన్య. సాక్షాత్తు మనుమఁడైన యీతని కృతులన్నియు విని యీ సుందరకాండమును దనపేర నచ్చువేయించవలసినదిగ జెప్పె. మాతృదేవికోరికను నెరవేర్పనెంచి యీకవి మామగారును, మేనమామగారునగు శ్రీమాన్ రంగనాథస్వామిగారికి సుందరకాండమును బ్రకటించి తెలుఁగు సాహిత్యలోకమున కందఁజేసిన పుణ్యమును సంపాదించుకొనుచున్నారు.

ప్రభాకరవంశ సుధాసాగరమునఁగనిన ప్రౌఢకౌస్తుభ రత్నము శ్రీ రామచంద్రమూర్తి, మహారాజచక్రవర్తి, సద్గుణగణ రత్నాకర

కుఁడు, వాత్సల్యరస సముద్రుఁడు. ఇట్టి ఆదర్శప్రాయుఁడైన రాజనారాయణుని దివ్యచారిత్రమును దెల్పు సుందరకాండమును బ్రకటింపఁజేసినందుల కాపురుషోత్తముఁడిట్టి యుదారానురాగ ప్రవర్ధమానులగు శ్రీమాన్ రంగనాథస్వామిగారికి వారి కుటుంబమునకు నెందును లోపములేని చిరకాల భోగభాగ్య శ్రీలను బ్రసాదించుఁగాక.

## ఉ ప సం హృ తి

మొత్తముమీఁద గ్రంథము మిక్కిలి రసవంతమై, ధారాళమై, సహజగమన శోభితంబై, సలక్షణమై శ్రుతికింపుఁ గూర్చుచున్నది.

రావణునికి హితబోధ సేయు ఘట్టమునందు నీతివైరాగ్య ద్యోతకములగు కొన్ని ఘట్టములందు, సీతాంజనేయ సంభాషణలను సూచించు భాగములందు విభీషణ నీతివాక్యములందు మిగుల హృదయరంజకములగు పంక్తులీకవి విచ్చలవిడిగ వెదఁజల్లినట్లు నిదానముగఁ జూచిన భక్తశేఖరులు గ్రహింపకపోరు. ఇట్టి కవితాసుధారసమును జుఱ్ఱఁగల భాగ్యము నాంధ్రలోకమునకిచ్చిన శ్రీరంగనాథస్వామిగారెంతయు వందనీయులు.

## క వి దీ వ న లు

గీ. సంఘసందర్భములయందుఁ జాలశ్రద్ధఁ
గలిగి నీవొనర్చు కృషికి నరిరినాడ
నాయురారోగ్య భాగ్యమ్ములంది ధాత్రి
మనుము; పార్థసారథి! కవిజనులుమెచ్చ.

గీ. బాలకవి బిరుదంబును బాల్యమందె
రద్దుఁజేయుంగఁ జాలిన ప్రౌఢకవిత

వ్రాయుచుంటివిగావున వసుధలోనఁ
బ్రౌఢకవిబిరుదంబునఁ గ్రాలుమోయి

గీ. అఖిలభాగ్య సమృద్ధి యుదారబుద్ధి
సకలవాంఛితాభీష్ట యశఃప్రసిద్ధి
సరసకవితాభివృద్ధి వాక్చతురబుద్ధి
పార్థసారథికిచ్చుతఁ బార్థుఁడెపుడు.

## గ్రంథాశీస్సులు

ఉ. సుందరకాండమంతయునుజూచితి నందు మనోహరంబుగాఁ
బొందికయుక్ హృద్యూక్తులును పోకడలున్ రసస్ఫూర్తి మాధుర్యమున్
బొందుగఁ గానఁపించె, రసముల్ దొలుకాడగఁజేసి వ్రాయు నీ
యందముఁజందముల్ మిగుల నారసి డెందమునందు మెచ్చితిన్

ఉ. రామచరిత్రయందు మధురంబగు సుందరకాండమన్న నా
రామచరిత్రకంతకును రాజితతేజముఁగూర్చుఁగాన నే
నీమెయిఁ బ్రోత్సహించితిని హృద్యముగా రచియింపుమంచు నా
రాముఁడొసంగు నీకు ననురక్తిగ సర్వశుభంబులిద్ధరన్.

క. చూచితి సుందరకాండముఁ
బూచి మనోహరముఁజేయు మొలకలవోలెన్
లోచనముల కింపెసఁగెన్
నోచిననోము ఫలియించె నోములపంటన్.

ఉ. ఎందఱో సత్కవీశ్వరులిఁకెందఱో గానకళావిలాసు లిం
కెందఱో రామభక్తులు మఱెందఱో పండితులైనవార లీ
సుందరకాండమంతయును సొంపుగవ్రాసిరిగాని నీదు కా
వ్యేందిరతో సమానమగునే? సుమనోహరకాంతి సంపదన్.

గీ. శిష్యుఁడనిఁ భక్తుండవు చెప్పనేల?
పొగడనేల? యితోఽధికముగ రచింప
నేర్చి తెలుఁగువారలకీర్తి నిలుపుమోయి
పార్థసారథీ! నీపేరుసార్థకంబు.

| | | |
|---|---|---|
| స్నేహలతా కవితాసంఘం<br>శ్రీజటప్రోలు సంస్థానం | } | ఇట్లు, బుధకవిరాజమిత్రవిధేయుఁ<br>వాజపేయయాజుల రామసుబ్బారాయుఁ |







# ఇష్టదైవస్తుతి

శా. శ్రీరామప్రభుకార్యధుర్యుఁడయి సుగ్రీవాదులగ్గింపఁగాఁ
బారావారము లెల్లదాఁటి ముదమొప్పన్ సీతనీక్షించి యా
నారీరత్నము భక్తినిచ్చిన మణిన్ వాతాత్మజుండీయ సు
స్మేరాంకూరితుఁడైన రామ నృపతి శ్రేష్ఠుండు మన్నించుతన్.

# ఆంజనేయస్తుతి

గీ. భక్తవరుఁడంచు లోకులెవ్వాని భజింతు
రట్టి రామార్చ్య నాస్వాంతు నధిక కాంతు
నతులధీమంతు బలవంతు నరికృతాంతు
శాంతు దాంతు హనూమంతు సన్నుతింతు.

# అంకితము

క. శ్రీ కాకుత్స్థకులాంబుధి
రాకాపూర్ణేందునకు ధరణిజాహృన్నా
ళీకద్యుమణికి రామ
స్వామికాంతున కంకితంబొసంగితి దీనిన్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

నిర్వచన

# సుందరకాండము

శా. శ్రీమద్రాఘవ కార్యభారమును పేర్మిం బూని శ్రీజానకీ
రామాన్వేషణ తత్పరుండయి జగత్ప్రాణాత్మజాతుండుతన్
ప్రేమంబారఁగఁ గొల్చియున్న కపులన్ వీక్షించి యిట్లాడె ను
ద్దామాభీలలయాంత నీరదరణద్గర్జాప్రతీకార్భటిన్.

చ. జలనిధి నుత్తరించి రభసంబున లంకకునేఁగి జానకిన్
గలయఁగఁజూచి వత్తు; నటఁ గన్పడకుండిన నివ్వసుంధరా
వలయమునంతయున్ వెదకివచ్చెద నాపయి లంకత్రో మహా
బలుని దశాస్యుఁబట్టుకొనివచ్చెద రామున కింపుఁ గూర్చెదన్.

చ. అని సముదారమోదభరితాత్ముఁడై కడుభక్తి నవ్వివ
ర్తనకుల వార్ధిసోముఁడగు రాముభజించి, తలంచిలక్ష్మణున్;
జ్జనకజనెంచి, తత్కపిగణంబులచే సెలవుంగ్రహించి, య
వ్వననిధి సంస్తుతించి, ఘనవాత మనోనిభ పూర్ణవేగుఁడై.

ఉ. అంబుధి నుత్తరింప నిటులామరుదాత్మజుఁడుత్సహించి ప
ర్వంబులయందు వారిధి యపారముగాఁ బయిఁబొంగునట్లు శౌ
ర్యంబున నిప్రమాణతనుఁడై చరణద్వయి కోడ నమ్మహేం
ద్రంబును ద్రొక్కిలేచె గగనంబునకెల్లరు సన్నుతింపఁగన్.

ఉ. ఆకపివర్యుఁడిట్లు సకలాభ్రచయంబులు సంచలింపఁగా
నాకసమందు మిక్కిలి రయంబున నేఁగుచునుండు వేళ ర
త్నాకరుపంపుఁగైకొని మహాంబుధినుండి జవంబు కోడ మై
నాకుఁడులేచిరాఁగఁ గపినాయకుఁడాతని వీడుకొల్పి నున్;

క. మఱికొంత దవ్వు చనఁగా
సురవర్యులయాజ్ఞఁ జేసి సురసాఖ్యభయం
కరవృత్తి నెదుర్పఁగ వా
నరముఖ్యుఁడు దానిగెల్చి నభమునఁ జనుడున్.

శా. ఛాయాగ్రాహిణియైన సింహికమహాసంరంభ మొప్పన్ బృహ
త్కాయుండైన సమీరనందనుఁడు వేగన్ మింటఁబోఁ జూచియా
హా! యాహారము చిక్కె రాముని కడున్ హర్షించి జృంభించి త
త్కాయచ్ఛాయను బట్టి యొక్కమొగి నాకర్షించెఁ దోరంబుగన్.

చ. ఘనధృతి నిట్టులయ్యసురకామినితన్ దివియంగ వాయుజుం
డనుపమ ఘోరనారకగుహాసదృశంబగు దాని వక్త్రమున్
గనుఁగొని సూక్ష్మరూపమును గైకొని యుద్ధతినందుఁ జొచ్చి దా
నినిఁ దునుమాడి తన్ముఖవినిర్గతుఁడై నెగసిల్లె మింటికిన్;

గీ. ఇట్లు మారుతి శ్రీరామకృపను జేసి
గండముల నెల్ల దాఁటి యుద్దండవృత్తి
వడి సువేలాచలంబుపై వ్రాలె; రామ
భక్తునకు సిద్ధిగానట్టి పనియుఁ గలదె;

ఉ. వ్రాలి శ్రమంబుదీఱ గుధరంబున నించుక విశ్రమించియున్
వ్రాలిన భక్తి రాముని మనంబున నెంచి; వసుంధరాసుతన్
జాల నుతించి యాపయిని సల్పఁగఁ బోవు చెయ్వులెల్లఁ దా
నోలి నిజాంతరంగమున యోజన సేయుచునుండ ముందటన్;

చ. హరిహయు వీటివంటి సముదంచిత హాటకసౌధరాజముల్
హరినికురుంబముల్ కరిచయంబులు నున్నత భూరి గోపురో
త్కరములు దుర్గపంక్తులును దారతరంబగు చంద్రశాలలున్
సురుచిరమై మనోజ్ఞ రుచిశోభితమై యలలారు కోటలున్;

సీ. తాలతక్కోలతమాల హింతాల ర
సాలాది బహుసాల జాలములును;
లలిత కోరకితపల్లవిత పుష్పితమంజు
నానా ప్రసూనవితానములును;
జకాంగ సారంగ శారికాచక్రాంగ
శుకపికాది శకుననికరములును,
కంజాత కువలయ కైరవకహ్లార
భరిత పద్మాకర వ్రాతములును;

గీ. బాగుగా నొప్పుచున్నట్టి వాకిళులను;
సాటిలేకెసంగెడు నాటకూటములును;
కడువిశాలమా రాజమార్గములుఁ గలిగి;
చూడఁ జూడంగ నెంతయుఁ జోద్యమగుచు;

సీ. రమణీయతపనీయరత్నాకరంజిత
ద్యోపథచుంబిత గోపురంబు;
బహువిధ కమనీయ వైడూర్యమణిగణ
ఖచితసౌధజితాల కాపురంబు;
నవమంజు జీవరత్న ప్రభాపిజిత శో
భాపూర్ణ భోగవతీపురంబు;
సంతాన కల్పకక్ష్మాజాది సర్వాల
తాజాల జితదేవతాపురంబు;

గీ. రాజరారాజ దేవతారాజముఖ్య
దైవతావలికెల్ల నంతకపురంబు;
దండులౌ దైత్యకోటికి దాపురంబు;
కలుములకు కాపురంబు లంకాపురంబు;

చ. కన్నులపండువై వెలయఁగన్గొని మారుతి తన్మనోజ్ఞ సం
పన్నతకెంతొ యబ్బిపడిఁ బాపురె దుర్గమమీపురంబె ద
ర్పోన్నతుఁడైన రావణుని యూర్కునుదీననుఁజొచ్చుటెట్లు యో
షిన్నుతయైన సీతదరిసించుటయెట్లని చింతసేయుచున్;

గీ. భూరిబలవంతు లిందలివారలెల్ల
నకట! గెల్వఁగాదిదియే యుపాయమునను
గాని యేదైన శ్రీరామకరుణయున్న
సిద్ధియౌఁగాదెయంచు యోజించుచుండ;

క. తనకుల దీపకుండురు సుదారగుణోజ్జ్వలుఁడైన రాఘుచం
ద్రునిపని భక్తితత్పరతతో నెఱవేర్పఁగడంగెఁగాన నీ
హనుమకు రాత్రియైన శుభమయ్యెడునంచును దోడుసేయఁగాఁ
జనెనన భాస్కరుండపరశైలముచాటునకేఁగె నంతటన్;

సీ. రావణాసురునుదగ్రప్రతాపము వాయు
పగిది సూర్యప్రతాపంబుఁ దొఱఁగె;
రాఁబోవు ఘోరసంగ్రామంబుఁ దెల్పుకై
వడి ఘూకతిత్త్యాది పక్షులఱచె;
భావిలంకాపురీ పతనంబు సూచించు
గతిఁ జిమ్మచీఁకట్లు కలయఁగ్రమ్మెఁ;
గర్బురభామాశ్రికణపంక్తి నెఱిఁగించు
భాతిని నక్షత్రపంక్తి మెఱసె,

గీ. హారఘనసార మల్లికాహార హీర
సారపారదకీర్తి నిస్తంద్రుఁడైన
రామచంద్రుని కరుణావరంబుఁ జేసి
హనుమకన్నియు ననుకూలమయ్యె నపుడు;

చ. దళ దిందీవరపంకజోత్పల సమేతంబైన కోనేటిలోఁ
గల హంసంబొకఁడింపుమీఱ నటనంగావించు చందంబునన్
విలసత్తార విరాజితంబగు నభోవీధిన్ విరాజిల్లె ను
జ్జ్వలశోభాతత చంద్రికావితతితోఁ జంద్రుండు నిస్తంద్రుఁడై.

సీ. వెన్నెల ఫుల్లుల వెతలన్నియును దీఱెఁ
జంద్రకాంతంబులు జాలువాఱె,
జక్కవపిట్టలు చాలవంతలఁగూరెఁ
గలువగమికి శోయగంబుమీఱెఁ,
గంజాతనికరంబు కరముడయ్యఁగఁబాఱెఁ
జల్లగాలియువీచె సారెసారె,
మరుఁడుపాంథులమీఁదఁ జూఱుకుఁగైదువు నూఱె
విరహులకెల్ల దెవ్వరము గేరె

గీ. నిండువెన్నెలతో మేదినియెసలారె
నంబురుహముకుళంబు లందళులుగూరె;
సర్వమానవజాతికి సౌఖ్యమూరెఁ
బూర్ణబింబంబుతో శశిపొల్పుమీఱె.

మ. హరివర్యుఁడపుడిందురాళ కనియారా! యిన్నిశాచారు లం
దఱు మాయావులు, గాన వీరి కపటత్వంబిన్నిశాచారుచే
నెఱుఁగంగల్గుదునంచు నెంచి ప్రముదాన్వీతాత్మకుండయ్యె, నా
ధ్యగణింపంచక మాయవంచకులచేతన్గాదె కన్గోవలెన్.

గీ. అట్లు చింతించి శ్రీరామునభినుతించి
సీతనగ్గించి లంకలోఁ జేరనెంచి
లంకఁజొచ్చు నుపాయసౌలభ్యమెంచి
మర్కటస్వరూపంబున మలయుఁదలఁచి;

గీ. సమ్మదంబున లంకాపురమ్ముఁ జొచ్చి
కలయనందెల్లచోటులఁ బొలయుచుండ
నతని లంకయను నిశాటి యడ్డగింప
నురుబలంబున దానిని నుక్కడంచి.

మ. పురిలోఁ జొచ్చి మనోజ్ఞహర్మ్యశిఖరంబుల్ రచ్చకొట్టంబులున్
వరవప్రప్రతతుల్, కవాటములు సోపానంబులున్ దైత్యమం
దిరముల్ వారణవాజిశాలలును మాణిక్యంపుఁగంబాలు సుం
దరమావీథులు నేలమాళియలు నుద్యానంబు లీక్షించుచున్.

గీ. ఇమ్మొగిఁ బ్రహస్తాదుల యిరవులెల్ల
వెతకి విశ్వకర్మైక నిర్మితముఁ గనక
వజ్రవైదూర్య మణిగణ భాసితంబు
నగువిమానంబుఁ గాంచి తదంకమందు

చ. ప్రిదిలిన కేశపాశములు వీడిన కాంచనరత్న హారముల్
వదలిన భూషణావళులుఁ బ్రక్కఁ దొలంగిన పైఁటచెంగులు
న్నెదరిన నల్లముంగురులు, నిద్దుర నేమఱి యున్న మేనులు
న్గదురఁ బరుండియున్న యెలనాగలఁ గాంచి తదంతరంబునన్,

సీ. మంజుల నవరత్న మౌక్తికహారముల్
దళకంఠములయందుఁ దాండవింప,
మృదుతర శ్రీగంధమృగమదపంకంబు
బాగుగా నెమ్మేనఁ బరిమళింపఁ,
దళుకొత్తు హొంబట్టు జలతారు పుట్టంబు
కటిసీమ కొక వింత గరిమఁ బెంపఁ,
బులుఁగురాచెక్కిన చెలువైన మంచంబు
పట్టు దేహమునకొక వన్నె నింప,

గీ. వాలుఁగానున్న వింశతి బాహువులును
ఘనతరోరగవారంబు ననుకరింప
నిదురచే మైమఱచి శయనించియున్న
రావణాసురుఁగాంచి నబ్రంబెసంగ;

ఉ. ఆ దెసనొక్క పక్క సముదంచిత కాంచన సౌకుమార్యమున్
గాదనఁ జాలునట్టి తనుకాంతియు నందము చందమొప్ప మం
దోదరి నిద్రవోవఁ గని యుల్లమునందున సీతయంచునా
హ్లాదముఁబొందియుం దుదకునాయమ కాదని చింతనొందుచున్.

ఉ. కాంచితినప్సరోంగనలఁ గాంచితిఁ జెల్వగు నాగకన్యలన్
గాంచితి రాక్షసీసతులఁ గాంచితి సుందర దివ్యకాంతల
న్గాంచితి నింకుచంద్రుని నవ్వఁగఁ జాలిన మర్త్యయోషలన్
గాంచితిఁ బెక్కు భామినులఁగాని మహీసుత గాననక్కటా.

చ. కలయఁగ సీతనెల్లెడలఁ గాంచితి నెందునుఁ గానిపింపదా
జలనిధి దాఁకి రామనృపచంద్రుని స్మరించుచు మేనువీడెనో
ఖలుఁడు దశాననుండు తనుగైకొనకున్న క్రుధన్ వధించెనో
చలమునఁ గ్రూరచిత్తులు నిశాచర కాంతలువట్టి మ్రింగిరో.

గీ. కాక యెందేని దాఁచెనో నాకవైరి
కపుల ముందట నేతె ప్రజ్ఞలను వల్కి
సీతఁ దోడ్తెత్తునంచు వచ్చితినయారె?
యెందుఁ జూచినఁ గానరాదేమి సేతు.

ఉ. సీతనుజూడకేఁ జనినఁ జెచ్చెఱ రాముఁడు గూలు; లక్ష్మణుం
డాతనికై వెతంబడుచుఁ బ్రాణములన్విడు, నంతమాతలున్
భ్రాతలుఁ జత్తురద్దివిని భానుసుతాదులుఁ దక్కువానర
వ్రాతము లీల్గునిట్టుల దివాకర కీశకులంబు లాఱెడిన్.

చ. కటకటా! దీనికంతకును గారణమేనొకరుండ నౌదు న
చ్చటి కరుదేరకున్నఁ గపిసంతతి నాకయి వేచి యుండి సం
కటమున మ్రగ్గునట్లయినఁ గార్యములన్నియుఁబొల్లవోవు ను
ద్భట జలరాశిదాఁటి యిటవచ్చియువమ్మగు మత్ప్రయత్నముల్.

మ. అని యొక్కించుక సేపుకుంది, యెటో ధైర్యంబూని, యిట్లూరకే
వనటంబొందగనేల రావణుని శుంభచ్ఛక్తి శిక్షించి చ
య్యన లంకాపురమంతయున్ వెదకి ప్రబ్రిహర్మ్యాండంబులూటాడి, రా
ముని దండంగొనిపోయి వీడెదఁ గపివ్యూహంబు సేబాసనన్.

చ. అనియిటు పెక్కుభంగుల నిలాత్మజుఁ డూహాయొనర్చి యివ్విధం
బునఁ దమకింపనేమిటికి? భూసుత కన్పడుదాఁకఁ జూతుఁగా
కనిమది నిర్ణయించికొని యచ్చటఁ బుష్పఫలాభిరామమై
ఘనవనమొండు పొల్పెసఁగఁగన్గొని సమ్మదితాంతరంగుఁడై:

గీ. అందు శుభచిహ్నములుకొన్ని యగపడంగ
నచట జానకీసతి యుండుననితలంచి
కల్పతరువట్లు శింశుపాక్షమారుహంబు
మిగులవర్ధిల్లఁగని దానిమీఁది కెక్కి.

సీ. కూసంబుపైఁ గప్పికొనియున్న ఫణివోలెఁ
బృథుధూళి క్రిమ్మిన వేణితోడఁ;
బంకదిగ్ధయగు నవమృణాళమునువోలెఁ
బ్రిభదొఱంగిన శరీరంబుతోడఁ;
జండాతపమ్లాన చారువల్లికవోలెఁ
గమలిన హస్తయుగ్మంబుతోడ;
సోయగంబెడలిన సొంపుఁజెందొవవోలెఁ
గడుజేవురించినకనులతోడ;

గీ. దీనయై మహాదుఃఖవార్ధిని మునింగి
పృథ్విపైఁబడి కుములుచు వివశయగుచు
మాటిమాటికి రామరామా యటంచు
నాత్మస్మరియించు చింతయు నడలుఁగొనుచు;

సీ. కృష్ణపక్షంబునందింపు బింబమువోలె
మిగులజానతిచియున్న మొగము దాని;
నళినీదళమునుండి జలబిందులోలుక్క వైఁ
గన్నుల నశ్రులు కాఱుదానిఁ
బాంసురూషితయైన స్వర్ణప్రతిమవోలె;
మెఱుఁగుదఱి గియున్న మేనిదాని;
నాయాసమునఁ బోఁజు నహిరాజముంబోలె
నెడయక నిట్టూర్పు విడుచుదాని;

గీ. గుడ్డ గూబలచేఁ జిక్కి కుందునట్టి
చిల్కయుంబోలె రాక్షసస్త్రీలమధ్యఁ
గడువడంకుచు గొల్లుననడలుదాని
జానకినిఁగాంచె నప్పవమానసుతుఁడు.

గీ. కాంచి సీతనుఁగూర్చి రాఘవన్ప పాలుఁ
జాడిన గుఱుతులంబట్టి యూవెలంది
యతని భార్యయే యని నిర్ణయంబొనర్చి,
మహితభక్తిఁ గేల్మోడ్చి నమస్కరించి.

ఉ. ఈమెనుఁబాసియొక్క క్షణమేనియు రాఘవుఁడుండఁజాలఁడా
రాముని సర్వసంపదభి రామునిఁబాసి నిమేషమాత్రమే
నీమెయునుండఁజాలదిత రేశరదర్శన కాంక్షఁజేసయే
యీమెయిమేనఁ బ్రాణములనిట్టు కుఁ దాల్చినదాయ బూనెఁగన్.

సీ. సముదార చారుసౌధములనుండిన కాంత
భయదకాననము లోపల వసించె,
మేలైన హేమంబట్టు చేల గట్టిన యింతి
దుమ్ముగ్రమ్మిన యంబరమ్ముఁ గట్టె,
రాముకౌఁగిటఁజేరి ప్రమద మొందిన నాతి
యియ్యశోకముఁ జేరి యేడ్వఁదొడఁగె;
సర్వసంపదలతో సౌఖ్య మొందిన భామ
వెతలఁబడి కడుదీనత వహించెఁ;

గీ. గటకటా! సర్వదేవతా త్మాతలేంద్రి
మహితకోటీర నవరత్న మణివితాన
భాసితాంఘ్రి సరోజుఁడౌ పతినిఁ బాసి
యొక్క నీచునిచేఁబడి పొక్కెనిట్లు,

చ. జనకధరాధినాథునకు సంతసమిచ్చు ననుంగుపుత్రియై
యనుపమధీరుఁడౌ దశరథావని భర్తకు ముద్దుఁగోడలై
ఘనుఁడగు రామభార్యయయి క్రాలెడు నీసుకుమారికకటా!
వనరుహ సంభవుండు దయఁబాసి విధించెనయిట్టి కష్టముల్,

గీ. జంటబాసిన జక్కవపెంటి రీతి
నీసతీమణి రామావనీంద్రుఁ బాసి
కొలఁదిలేని శోకాంబుధిఁ గుములుచున్న
దకట! విధివ్రాలుదాఁటఁగా నలవియగునె;

గీ. అంచుఁ బెక్కుభంగుల విచారించుచుండ
వెన్నెలయుఁ జాఱె రిక్కలు వెల్లవాఱెఁ
దమ్ములలరారె, మధువసంతతులుఁ గేరెఁ
దెలివిదేకూరె భల్లునఁ దెల్లవారె;

ఉ. అంతటఁ దూర్పుదిక్కున నుదంచిత తీక్ష్ణకరాలితోడ భా
స్వంతుఁడు పర్జ్వరిల్లుచు నెసంగఁగఁ బావనికాంచి జానకీ
కాంతను పల్కరింపనిది కాలముగాదిఁక నల్ల పద్మినీ
కాంతుఁడు నస్తమించు దనుకన్ దగ వేచెదనంచు నచ్చటన్

గీ. అల్పగాత్రుఁడై సాల శాఖాలిమధ్యఁ
దానగోచర వైఖరిదాఁగియుండె
నపుడు క్రమముగ భానుఁడస్తాద్రిఁజేరెఁ
జందురుఁడే తేరె నురుతమిస్రంబుజాఱె;

గీ. అంత నిదుర మేల్కాంచి దశాననుండుఁ
జండపుష్పకోదండ ప్రచండకాండ
కాండసంపీడితాత్మ పంకరుహముఁడగుచు
జనకపుత్రిని నెమ్మనంబునఁదలంచి;

సీ. చల్లనివన్నీట జలకంబు గావించి
చంద్రికాధవళ వస్త్రంబుఁగట్టి,
మృగమద శ్రీగంధ మిళితగంధములంది
కోమరారనుదుటఁ గుంకుమముపెట్టి,
మంజులనవరత్న మణివిభూషలఁ దొడ్గి,
బొమిడికల్ దశశీర్షములధరించి,
రంగైన పుల్గురాయుంగరంబులఁబూని
కమనీయ పాదరక్షలనుదొడిగి,

గీ. దనుజ కాంతాలలామలు తన్నుఁగొల్వ
సురగరుడ విలాసినులు వీ చోపులిడఁగ
జానకినిఁజూడ నేతెంచె సరభసమున
దానవుండు ప్రపంచవిద్రావణుండు.

మ. కరిణీమధ్యమునం జరించు మదరాగంబట్లు భామాసము
త్కరమందొప్ప దశాస్యుఁ డంతఁ దనచెంతన్ జేరనీక్షించి యా
ద్ధరణీపుత్త్రికచాకుచంబులను చేతన్గప్పి కట్టల్కయున్
వెఱఁగున్ రెక్కఁగన గాలికిన్ వడఁకు తీవెంబోలెఁ గంపించుచున్.

గీ. పెడమొగము వెట్టి, కొండొకయెడఁ దొలంగి,
యుల్లమున రాముఁ దలపోయుచూఱకుండ
నాసతీమణి డాసి రక్షోధిపుండు
మృదుమధురవాక్యఫణితిఁ దానిట్టులనియె.

చ. వెలఁదిరో! నన్నుఁ గాంచి కనుభీతిఁ దొలంగెద వేల? నీకు నే
నలఁతినె? నీకవుంగిలిఁ బ్రియంబుగఁ బొందఁగఁ గాదె యిన్ని నా
ళ్ళలసితి, నింక నన్నుఁ బ్రణయంబెసలారఁ గ్రహింపు పూవుటు
మ్ముల నెఱజోదు వేయు బలుములుకుల బారికిఁ బాలఁ జేసెనన్.

చ. అనుపమభోగభాగ్యవిభవాదులతోఁ దులఁదూగుచున్నఁ గా
దని యొకభార్యహీనుభ్రమదాటవులం దిరుగాడువాని న
ల్పుని రఘురాము నేల తలపోసెదు కల్మిఁ గాలఁదన్ని త్రే
మునివలెఁ దేలు రాముఁ డిఁకమీఁద టవీడుఁడు! నన్నుఁ గూడుమా?

సీ. ఎవ్వాని వాఁకిట నింద్రాదిదేవతల్
పడిగాపులై పడి యుండుచుందు,
రెవ్వాని వీటిలో నెండయు గాలియుఁ
జొరఁబడ నెంతయు వెఱచుచుందు,
రెవ్వాని ధాటికి నీరేడులోకముల్
గడగడ సతతంబు వడఁకుచుందు,
రెవ్వాని కౌఁగిట జవ్వను లెందఱే
ననుపమసౌఖ్యంబు లనుభవింతు,

గీ. రెవ్వఁడా పుష్పక విమాన మెక్కి తిరుగు
వాఁడు భక్తోత్తముఁడు లలాటేక్షణునకు
నిట్టి గండరగండఁడ నేన కాని
యెవ్వనాటుండు రాముండె యంబుజాక్షి.

సీ. నిండు చందురుఁ బోలు నీదైన నెమ్మోము
మిక్కిలి జానతి మెఱుఁగు దఱుఁగ,
మేలి బంగారంబుఁ బోలు నీ నెమ్మేను
కడుమ నూరము గ్రమ్మి కాంతి సెడియె,
నీ రేజముల బోలు నీదైన కందోయి
వావిరి యేడ్పుచే జేవురించె;
మృదుమృణాళము వోలె మెఱయు నీ కెంగేలు
వాడిన లతరీతి వన్నె సుఱఁగ,
గీ. జలగుహాక్షి! నిరాహారములఁ ద్యజించి
వగచి కృశియించి యూరక వనరెదేల?
యింపుమీఱ నన్నాడి సుఖింపరాదె
భూరి భోగభాగ్యములు చేకూరు నీకు.

ఉ. మైమెయి బంతిక్రైవడిను మాధవు శైలము మీఁదికెత్తితి
స్వీమ పరాక్రమంబెసఁగ నిర్జరవీరుల తోడఁ బోరి సం
గ్రామమునందు గెల్చితి, జగంబుల నెందును సాటిలేని కాం
తామణులన్ గ్రహించితిని నాదు ప్రతాప మెఱుంగు మంగనా!

చ. వనములఁ గాయు చంద్రికలభంగి సతీమణి! నీదు నిండు యౌ
వనగరిమంబు నేటికిటు వమ్ము నరింతువు? నీకునై సతం
బును దపియించు శౌర్యవిభవున్నను నేలి సుఖింపుమిట్లు వే
దనఁ బడనేల? రాముఁడు పదంపడి నిన్గొనిపోవఁ జాలునే,

క. సిరులన్ జూపిన నను నీ లోఁ
బఱచికొనఁ దలంచితే మొసాపాత్ముఁడ! సీ
సిరులన్నియు నారాముని
చరణకమలరేణునకు సరిగావెందున్.

గీ. రామపాదారవింద నిర్యన్మరంద
బిందుసందోహశోషి తేందిందిర నగు
నేను కలనైన నిన్నెంచు దానననుము
దుఁ(?)పకోరి దైత్యాధమ! కలుషచిత్త.

చ. సిరిగలవాఁడనంచును విశేషబలాఢ్యుఁడనంచు నిర్జరో
త్కరములగెల్తునంచును మదంబునఁ ద్రుళ్ళుచునుంటివేని యా సం
గరమున రాముఁడే ధనువుఁ గైకొనినిల్చిన నీవగాదు నీ
సరియగుకోటిరావణులు సర్వనిలింపులు నిల్వనేర్తురే.

చ. అనియిటుదూఱఁగాఁ విని దశాస్యుఁడు డాగ్రహమూర్తియై చూడ్కలో
చనుఁడయి నాతి! నాయనమజ్ఞనము నీయెడలగ్ని పరాటవే
నినుఁ దెగవ్రేయ లేక వినవేరని పల్లద మింతపల్కె నా
న్మనమున సాపరాగ వచనంబులుగాఁ దలపోసి సైచితిన్.

గీ. పడతిరో! యింక రెన్నెళ్ళగడువునిత్తు
వలఁచి యంతలో నాకు లోఁబడక యున్న
నిన్ను దుష్కృతంబనక ఖండించివైతు
ననుచు బెదరించి రాక్షసాంగనలఁ జూచి.

గీ. మీరు రెన్నెళ్లలోన నీపారసాక్షి
నాకు లోఁబడఁజేయుఁడు కాకయున్నఁ
దినుఁడు గడికండలుగఁగోసి తలఁచిదీని
ననిన గిన్కతో సీత దశాస్యుఁజూచి.



గీ. నామనోనాథుఁడైన శ్రీరామునాజ్ఞ
లేకపోవుటఁ జేసి యోరి కుబుద్ధి!
నిన్ను శపియింపఁ దలఁపఁగానిని నీదు
సిరుల క్షణమాత్ర భస్మంబుఁ జేయలేనె?

ఉ. రాముఁడు మర్త్యమాత్రుఁ డెటు రాగలఁ డంచుఁ దలంపకోరి సు
త్రామ సహస్ర విక్రముఁ డతండు; క్షణంబున లంక దాఁటి సం
గ్రామమునందు నీదశశిరంబులఁ ద్రుంచి ననుం గ్రహించు నీ
తామసబుద్ధిమాను మెడదన్, బ్రదుకంగల యాసయుండినన్.

చ. అనియిటు ధిక్కరింపఁగ దశాస్యుఁడు భగ్గునమండి, మిణ్గురుల్
గనగనమంచు నేత్రములఁ గాఱ; నవారిత రోషతాపముల్
పెనఁగొనఁ గేలవాలు ఝళిపించుచు సీతను సంహరింపఁగాఁ
జనునెడ ధాన్యమాలిని వెసన్ జని యాతని నడ్డగించుచున్.

గీ. దనుజనాయక నీకింత కినుక యేల
శౌర్యవంతుఁడ వబలలఁ జంపఁదగునె
రతులఁ దేల నీకెందఱు సతులు లేరు
శాంతిఁ బొందు మొక్కించుక స్వాంతమందు.

ఉ. అంచును మందలింప దరహాసముతోడఁ బ్రశాంతి నొందిన
క్తంచరనాయకుండరిగెఁ గ్రమ్మఱి, యంతటఁ దన్నియుక్త రా
త్రించరభామినుల్ వివిధ కృత్రిమరూపులు భూకుమారిఁ ద
ర్జించుచు రాక్షసేశ్వరు వరింపు మటంచు నలంచి రెంతయున్.

ఉ. రక్కసులిట్లు నిష్ఠురతరంబుగఁ దన్ను కఠోర వాక్కులన్
దక్కక బాధఁ బెట్టమది దాళఁగలేక యశోక వృక్షమున్
దిక్కుగఁ బట్టి కొంచు జగతీసుత యేడ్చెఁ గలస్వనంబునన్
దృక్కులనుండి యశ్రులు ఝరీయుగముంబలె జాలు వాఱఁగన్,

మ. జనకోర్వీపతి పుత్రినై దశరథ క్ష్మామండలీ సార్వభౌ
మునకుం గోడలినై యుదారగుణధాముండైన శ్రీరామచం
ద్రునకున్ బ్రేయసినై పతివ్రతలలోఁ దోరంపు కీర్తిం గడిం
చిన నాకక్కట యిట్టి కష్టము సురజ్యేష్ఠుండు శాసించెనే.

గీ. రాఘవునిఁ బాసి రక్కసుల్ పల్లవముల
వల్కిననుఁ జాకకటకటా బ్రదికియుంటి,
జనుల కాలమందెన్నఁడుఁ జావరం దు
నీతి విడులాడు వాక్యంబు నిక్కమే మొ.

చ. అని మొనదేవదానవ సహస్రములొక్కటియై మదించి పే
ర్చిననుక్షణంబులోన నెదిరించి జయింపఁగలట్టి శూర తా
ధనుఁడు రఘూత్తముండు త్వరితంబుగ వచ్చి ప్రియుం బెలర్పఁగా
ననుఁగొని పోక యిమ్మెయి మనంబున నేల యుపేక్ష సేసెనో.

గీ. వితత చతురబ్ధి వేష్టితక్షితి తలేంద్ర
మహిత కోటీర నవరత్న మణివిభాసి
తాంఘ్రికమలుని స్వర్ణాంగి సయ్యు
నకట! తుదకెట్టి నిర్భాగ్యురాల నైతి.

గీ. అని యనేకభంగుల నిట్లు లవనిపుత్రి
వగచుచుండంగ రాక్షసీ వనితలెల్ల
హుంకరించుచు బెదరించుచుండి రంత
మేలిగుణరాశి త్రిజటాఖ్య మేలుకాంచి.

సీ. రక్షోవినాశంబు రాఘవవిజయంబుఁ
గలుగఁ బోయెడు నొక్కకలనుగంటి,
సీతాసతిం గూడి శ్రీరామలక్ష్మణు
లలపుష్పకంబుపైఁ బోలయుగంటి,

ముండిత శీర్షుఁడై పొల్చి దశాస్యుండు
గోమయ సరసి నీఁగుటను గంటి,
మంత్రి సమేతుఁడై మన విభీషణనేత
శ్వేతశైలంబుపై వెలయఁగంటి

ఆ. తలఁప నాదుస్వప్నంబు నిక్కలయె యగును
రాముఁ డేతెంచి యింక సర్దానవములఁగ
రావణుంగూల్చుఁ గాన సీతమనిఁక మీరు
బాధఁబెట్టఁగవలదన్న వారుఁజనిరి.

తే. అంత జానకీదేవి; దశాననుండు
"రెన్నెలలలోన నన్ను వరింపకున్న
గ్రక్కునవధింతు"నన్న దుర్భాషణముల
హృదయమున నెంచి యిటువిచారింపఁ దొడఁగె.

క. ఎక్కడి సాకేతపురం
బెక్కడి లంకాపురమిటు "లెక్కటినై యీ
రక్కసుచే వేఁబడుమని"
వాక్కాముఁడు వ్రాసె నాదు పాపంబేమో?

ఆ. రెన్నెలలగడువిచ్చె రాత్రించరుండు
మునుజటాయువు నాకయి పోరి మడిసె
రామునకు నావ్యవస్థ సర్వంబుఁ దెలుప
నిచట నేరు లేరింక నాకేదిదిక్కు;

ఉ. అక్కసుతీఱఁగా నను దశాస్యుఁడు చంపినఁ జంపనిమ్ముఁ గ్రూ
రక్కసులెల్లఁ గోపమున గ్రక్కున మ్రింగిన మ్రింగనిమ్ము, నే
దిక్కఱియెక్కటింబలె మదీయమనోధవుఁ బాసి యిమ్మెయిన్
వెక్కసమైన పాట్లనుభవించుటకన్న మృతించుటొప్పదే!

## సుందరకాండము

గీ. శ్యామజలదంబు నదయ వర్షంబుఁ గురియు
ననుచు విన్నాళ్లఁ జాతకంబట్లు లిచటఁ
గాఁచియుండితి నీచాతకమ్ము నోట
నదయవర్షంబుపడునో? వజ్రింబుపడునో?

ఉ. అక్కట గొంతు గోసికొని యైనవిషంబును ద్రాగియైననే
నిక్కడఁజత్తునన్ననసి నిశ్చెడువాఁడు విషంబునిచ్చువాఁ
డొక్కఁడుఁ గానరాఁడు, తెరువేదియు లేదిఁకనాకు వేణియే
దిక్కనిమోంచి దానురిదీసికొనన్ దమనించుచుండఁగన్,

గీ. త్రిజట వాక్కులు జానకీదేవి వెతలుఁ
జూచుచుండిన యంజనానూనుఁడామె
నూఱడించు నుపాయంబు నూహసేసి.
యామె వినురీతి నిట్లనె నాదరముగ.

సీ. జలజనాభాంశుఁడై జన్మించె నెవ్వాఁడు
సూర్యాన్వయాంభోధి సోముఁడగుచుఁ,
గఱకంఠు బాణంబు ఖండించె నెవ్వాఁడు
సర్వలోకంబులు సన్నుతింప,
ఖరదూషణాదులఁ బరిమార్చె నెవ్వాఁడు,
ప్రకటపరాక్రమ క్రియమెసంగఁ,
గృతవీర్యసుతవైరిఁ గేరించె నెవ్వాఁడు
తృణముకైనడికేల నిషువునెత్తి,

గీ. జనకునాజ్ఞను దాశిరసావహించి
పత్నితోఁగూడి యెవ్వాఁడు వనులకేఁగె
నట్టి రాముండు తమ్మునితోఁ బ్రాణకాంతఁ
గలయు వెదకుచు ఋశ్యమూకంబుఁజేరె,

గీ. అపుడు సుగ్రీవు సఖ్యంబు నాచరించి
వాలిఁ జంపి కిష్కింధలో భానుజునకుఁ
బట్టముఁ గట్టి యెందఱో వానరులను
సకలదిక్కుల వెదకంగ సరగఁ బనిచె,

ఉ. అమ్మరో? దక్షిణంపుదిశ యందుననున్ వెదకంగ నంపఁ జే
తమ్మున మోదమూని త్వరితమ్ముగ వార్ధిదాఁటి లంకలో
నిమ్ముగ నెల్లెడల్ వెదకి యెందును గానక మత్పురాత్త భా
గ్యమ్మునఁ జేసి నిన్నిచటఁ గంటిఁ గృతార్థతఁ గంటి నెంతయున్.

క. రాముండును సౌమిత్రియు
సేమంబుగ నున్నవారు, చిత్తములందున్
బ్రేమంబున వారలు ని
న్నేమఱుఁ దలపోయుచుందు నిక్కముతల్లీ!

చ. అనవిని శీర్షమెత్తి జనకాత్మజ శింశుపమీఁద నున్న యం
జనసుతుఁ గాంచి డెందమున సందియ మొప్పఁగ నద్ది స్వప్నమా
యని తలపోసి, కోఁతిఁగలయందు కనుంగొనరాదు కాన నా
కును నలరామలక్ష్మణులకున్ గడు భద్రముకల్గుఁ గావుతన్.

గీ. రాముఁ బాసిన విరహాగ్ని ప్రబలుకతన
రక్కసులబాధ కతన నిద్రయు నెఱుంగఁ
గాన నియ్యది స్వప్నంబు కాదు; రామ
నృపతి దూతయా నీకపి నిక్కువంబు.

గీ. అనుచుఁ దలపోయుచున్నంత ననిలసుతుఁడు
భూరుహము డిగ్గి యామె రాముసతియౌట
నెదనెఱింగియు నామెచే నెఱుఁగఁదలఁచి
యెంతె వినయంబుమీఱఁ దానిట్టులనియె,

ఉ. ఎవ్వరవీవు సాధ్వి! పెనుపేదఁగఁగుంది కృశించివంతతో
నివ్విధి బాష్పముల్ దొరఁగనేడ్చెదవేటికి; నిన్నుఁజూడఁగా
నెవ్వగ గల్గుచున్నయది; నీవలదుష్టదశాననుండు తాఁ
గ్రొవ్వునఁ గొంచుతెచ్చిన రఘుప్రభుభార్యవొ చెప్పు నావుఁడున్.

ఉ. వరమహిఁబుట్టితిన్ దరణివంశముఁ జొచ్చితినందు భూమిభృ
ద్వరుఁడయిపొల్చు నాదశరథప్రభువర్యుని కోడలైతి ని
ర్జరపరిసేవ్యుఁడైన రఘురామునకున్ సతినైతినో వనే
చరకులదీప యిన్నిటఁ బ్రశస్తికినెక్కినదానఁ జూడుమీ.

గీ. అని మొదటినుండియుఁ దనవృత్తాంతమెల్లఁ
బలికి తానొందుపాట్లు రావణుఁడు తన్ను
"రెన్నెలలలోనఁ బరిమార్తు" నన్ననుడులు
దీనవదనయై సర్వంబుఁ దెల్పెనంత

ఉ. వాయుతనూజుఁడు న్వగచి పావని! యింతఁ గృశింప కాది నా
రాయణుఁ డర్కవంశకలశాంబుధిసోముఁడు రాఘవుండు నేఁ
బోయి వచించినంతనె సముగ్రవనేచరసైన్యయుక్తుఁడై
వేముకుదెంచి లంక నతివేలజవంబున జుట్టు ముట్టియున్.

గీ. తల్లి! నీవు హర్షింప నిర్దానవముగ
నుద్ధతుండైన రావణునుక్కడంచి
నిన్నుఁ దనతోడఁ గొనిపోవు నిక్కమనుచు
సరసఁ దరియంగ జానకి సంశయించి.

కం. దనుజాధము! యీ చందం
బుననుఁ గికురించె దేల? మునిభిక్షుఁడవై
కొనివచ్చి మరలమాయా
వనచరరూపంబుఁ దాల్చి వచ్చితె యిటకున్.

గీ. అనుచు దూఱంగ నమ్మారుతాత్మజుండు
వినయ వినమితగాత్రుఁడై వినుము తల్లి!
నిక్కువంబుగ నేను వనేచరుండ
వికృతదైత్యుండఁగానిది విశ్వసింపు.

ఉ. నెట్టనవిట్లు చెప్పనవనీసుత నిక్కపుఁగోత్రితైన నో
నెట్టిఁడు రాఘవుండు, తదహీన పరాక్రమరూప సద్గుణం
బెట్టిది, యంగసౌష్ఠవమదెట్టిది, తత్సహజుండు లక్ష్మణుం
డెట్టిఁడెఱుంగఁ జెప్పుము; కపీంద్రునిగా నిను విశ్వసించెదన్.

క. అనిపల్కఁగ భూమీసుత
మనమునకున్ నమ్మకంబు మహితముదంబున్
బొనరెడుగతి వినయంబుగ
ననిల సుతుండిట్టులనియె నాయమతోడన్.

మ. స్మరభిచ్చాపవిఖండనుండు, సకలక్ష్మాపావతంసుండు భా
స్కరవంశోదధిపూర్ణచంద్రుఁడు విశేషస్థైర్య ధుర్యుండు ని
ర్జరపూజ్యుండు జితేంద్రియుండు దరహాసస్ఫీత వక్త్రుండు ని
ర్భరసౌందర్య వినిర్జితాంగజుఁడు శ్రీరాముండు సాధ్వీమణీ.

ఉ. నల్లనివాఁడు సద్గుణగణంబులవాఁడు, కృపార్ద్రబుద్ధి భా
సిల్లెడువాఁడు కీర్తివిలసిల్లెడువాఁడు వెడంద ఱొమ్ము రా
జిల్లెడువాఁడ; పూర్వమగు శ్రీవెదజల్లెడువాఁడు మంజు సం
ఫుల్లసరోజపత్రముల బోలు కనుంగవవాఁడు తల్లిరో.

క. శ్రీవంబులు విజ్ఞానో
ద్దీపంబులు పాపపుంజదీర్ఘ తమిస్రా
దీపంబులుఁ గైవల్య స
మీపంబులు రామచంద్రు మృదురూపంబుల్.

గీ. రూపమందు సువర్ణ వర్ణుండు కాని
పీన వక్షుండు శూరుఁడా జానుబాహుఁ
డఖిలసద్గుణంబుల సుమిత్రాత్మజుండు
నన్నతో సరిపోలువాఁడఖిల జనని!

ఉత్సా! అంబరో! వనాట వర్యులంగదాదు లెల్ల రా
యంబురాశి యొడ్డునన్మదాగమంబు కోసమై
యింబుమీఱ వేచియుందురింక నీదుసేవముస్
సంబరంబుతోడఁదెల్ప జాగులేక పోవలెన్.

గీ. నిన్నుఁ గోల్పోయి రాముండు నీదుజాడ
నరయు చరుదెంచి మాల్యవంతాద్రిఁ జేరి
యచట సుగ్రీవు సఖ్యంబు నాచరించి
నీయుదంతమడుగఁ గపినేత లెల్ల.

చ. మును దశకంఠుచేఁదవిలిపోవుచు నీవు వెసన్ బటాంచలం
బున ముడివైచి జార్చినవిభూషలు సర్వముఁ దెచ్చి చూపఁగా
వెనుబడి నీతెఱంగరయఁ బెక్కువనాటుల నాల్గుదిక్కుల
న్పనుపుచు దక్షిణంపు దిశనన్నుఁ గనుంగొనఁ బంపె మానినీ.

క. అనిలుని పుత్త్రుఁడ రామా
వని నాథుని సేవకుండ భానుజ సచివుం
డను నీదాసుఁడ నిజముగ
హనుమన్నాముండ నేను నాలింపు కృపన్.

గీ. అనుచుఁ బాదంబులకు మ్రొక్కి వినయ మెసఁగ
మానినీ! యింక నీకనుమానమేల?
భవద ధీనుండ నీకానవాలుగాఁగఁ
బ్రేమనిచ్చిన భద్రముద్రికను గొమ్ము.

చ. అనుచును జేతికీయ జనకాత్మజ నాథునియట్టి దానికిన్
గనులకు నద్దికొంచుఁ గుతుకంబున ముద్దిడి యిన్ని నాళ్లనే
వనటఁ గృశించుచుండనను బాసిచరింపఁగ రాఘవేంద్రుఁ డె
మ్మనమెటులొప్పెనిన్నుఁ బ్రతిమాలెదఁ జెప్పుము భద్రముద్రికా.

ఉ. రాముని వార్తనేను మధురంబుగ నెట్టు లెఱుంగ నేర్తునో
రామవిభుండు నాపదదురంత విపద్దశ లెట్టు లెఱుంగునో
యేమియుఁ దోఁచకిందనుక నెంతయుఁ గుందితినీవు వచ్చినా
భాములఁబాపి నావిభుని వార్తలఁ దెల్పితి సంతసంబుగన్.

మ. అనియొక్కించుక మోద బాష్పములు నేత్రాబ్జంబులం బర్వఁ బా
వనినీక్షించి మరుత్కుమార! ధృతియొప్పం గోష్పదంబట్టు లీ
వనధిం దాఁటితి; రాముఁ దెల్పితి మహాపన్మగ్న నన్ మించి తిం
కను నీవా హరివంశమున్నిలిపితే కాకులంబు వేయేటికిన్.

ఉ. ఎన్నఁడు వారిరాశిఁ దరియించి రఘూద్వహుఁ డేఁగుదెంచుఁ దా
నెన్నఁడ ఖర్వగర్వ సముపేతుని రావణుఁ ద్రుంచు నెన్నఁడా
పన్నగ నన్నుఁ బ్రేమదయి వారగఁదో కొనిపోవు నింకనే
నెన్నఁడు కాంతుఁ గాంతు సుఖమెన్నఁడు కాంతునటంచు నేడ్చినన్.

చ. కనుఁగవనుండి బాష్పములు కాల్వలుగట్టఁగ నేల యేడ్చెదో
ఘనతరకీర్తి పంక్తిరథు గాదిలికోడల; యోమదంబ; యో
యినకులదీపురాణి వినుమింక దశాస్యుని సంహరించి గొ
బ్బున నిను రాఘవుండుఁ గొనిపోవుఁ ద్రిశుద్ధిగ నమ్ము మానినీ.

క. నినుఁ బాసినది మొదలు తీ
ఱని ఘనశోకంబుఁ జేసి రామవిభుండున్
ధను వెందుకు మను వెందుకు
తను వెందుకటంచు సంతతంబును వగచున్.

సీ. శారద పూర్ణిమాచంద్రబింబముఁ గాంచి
నీముఖంబంచును నెగులుఁ బొందుఁ
పసమీఱుఁ జెలువైన బిసతంతువులఁజూచి
నీకరాబ్జములంచు శోకమొందుఁ;
కీరపికాదుల కేకల నాలించి
నీగళస్వరమని నెఱిఁదపించు,
నెఱినైన శైవాల నికరంబు నీక్షించి
నీకచంబంచు నెంతేసి వనరు,

గీ. నినకులేశుండు నిన్నుఁబాసినది మొదలు
నిరతి నాహారమొల్లఁడు నిద్రఁగొనఁడు
పల్కఁడొకనాఁడు నిచ్చమైపగలతోడ
మనసు నీమీఁదనుంట రామామతల్లి,

గీ. అతఁడు నావల్ల నీదు వృత్తాంతమెల్ల
విన్నతోడనె నాకన్న వీరులైన
పెక్కు కీశవర్యులతోడ వేగవచ్చి
సంతసంబారఁ గొంపోవు నైపుమన్న.

క. మనమున నందాఁకను నీ
వనఁటల నైరింపవేనిఁబావని! నాపైఁ
బెనుపార నధిష్ఠింపుము
నిను రామునికడకుఁ జేర్తు నిముసములోనన్,

క. అనవుఁడుఁ గడునబ్బురపడి
యనిలాత్మజ! నీవుఁజూడ నతిసూక్ష్మాంగుం
దనుఁడవు రామునిదండకు
నను నెటు గొంపోవనేర్తు నైజముఁజెప్పుమా!

మ. అనినన్ వహ్నిసమానుఁడుం గనకశైలాకారుఁడుం బ్రోన్నతుం
డును బాలారుణ తామ్రవక్త్రుఁడయి మిన్నుల్ మస్తకంబంటఁగా
ఘనపాథోధులు జాను దఘ్నములుగాఁగా దిక్కులన్ నింపుచున్
హనుమంతుండు భయంకరంబయిన యాత్మాకారముం జూపినన్.

ఉ. ఆతనిఁ జూపుఁ గాంచి జనకాత్మజ! యెంతొ వెలుంగు నొందు యో
వాతతనూజ! నన్గొని నభంబున నేఁగెడు వేళ రాక్షస
వ్రాతముఁ గాంచి నిన్ శరపరంపర నొంప నిరాయుధుండ వి
వే తెఱఁగడ్డగింతువొ మఱెమ్మెయి నన్ను సముద్ధరింతువో?

గీ. క్రిందఁబడ్డ రాక్షసులు భక్షింతురన్న
వార్ధిలోఁబడ్డ జలచర వ్రజము మ్రింగు
సర్వయత్నంబులవుడు విఫలము లౌను
గాన నియ్యది యుక్తంబు కాదు సుమ్మ.

గీ. అదియునుంగాక తా నెట్టి సుదతియైనఁ
బరపురుషుల స్పృశించుట పాడిగాదు,
కాన నీవరయేతెంచి నా కాంతు నిటకుఁ
దోడి తెమ్మన హనుమ నతుల్ పొనర్చె.

చ. జననిరో! యింక నేనిచట జాగొనరింపక రామరాజ ము
ఖ్యునకును భానుజాది కపికోటికి నీ తెఱఁగెల్లఁ దెల్పఁగా
జనియెద నానవాలొకఁ టొసంగుమటన్న సమీరసూతి కి
జ్జనకకుమారి కొన్ని వచనంబులఁ దెల్పఁదలంచి యిట్లనెన్.

ఉ. ఇమ్ముగఁ జిత్రకూటమున నేను రఘూద్వహుఁ డొక్కనాఁడు సౌ
ఖ్యమ్ముగ నిద్రవోవ నడఁగాక నిశాటుఁ డొకండు మత్కుచా
గ్రమ్మును ముక్కునం బొడువఁ గన్గొని రామవిభుండిషీక మా
త్రమ్మున దాని రూపడఁచె దత్కథనంతయు జ్ఞప్తి సేయుమీ!

సీ. రవికులాంబుధిచంద్రు రామనృపాలేంద్రు
నల్లన మ్రొక్కితినంచుఁ జెప్పుము;
జననిభావముతోడ ననుఁగొల్చు లక్ష్మణు
సాదరమతి నడిగినట్లు జెప్పుము;
శ్రీరామపాదరాజీవంబె దిక్కని
యాత్మలో నమ్మితినంచుఁ జెప్పుము;
నేనొక్క నెలదాఁక నేమంబుమై నెట్లొ
యతనికై జీవింతునంచుఁ జెప్పుము;

గీ. అంగదాదుల నడిగితినంచుఁ జెప్పుము
నావతిని సర్వకీశ సైన్యములతోడ
సరగఁదోతెమ్ము కపిరాజ! జగతిలోన
నిరతఁ జిరంజీవివై రహియింతువీవు.

మ. అని దీవించుచుఁ జేలగట్టిన యమూల్యంబైన రత్నంబు న
ల్లనసీయంగొని వాయునూతి పరమోల్లాసంబు దీపింప లో
చన యుగ్మంబుల కద్దికొంచు సముదంచద్భక్తి దైవారఁ గ్రొ
న్ననవై దేహికి మ్రొక్కి, పోవఁగఁ దదాజ్ఞం బొంది సోత్సాహుఁడై;

మ. తన రాకప్పుడ పంక్తికంఠునకు విస్తారింపయత్నించి య
వ్వనముం ద్రుంచినదెల్ల మానవని నెసఁగ్ వాలంబు జాడించి, దు
ష్టను భంజించి ఫలంబు లూడుఁద్రెచి పూలందున్న మ్రాకుల్ విది
ర్చి నికుంజంబులఁ గూలఁద్రోసి లతికా శ్రేణిన్ విదారించియున్.

గీ. మంజరులఁ గాల్చి పెద్దకొమ్మలను విఱిచి
మొక్కలఁ బెల్చి పూఁదోఁట్లఁ బోడిగొనర్చి
వల్లులు పద్మాకరంబులఁ బాడు సేసి
చెలఁగి వనమెల్ల నాశంబు సేయుచుండ.

సీ. అంతఁ బొడమిన వివిధవృక్షారవంబుఁ
గలఁతఁజెందిన విహగాలికల కలంబు
హనుమకంఠారవంబును నైక్యమగుచు
రోదసీస్థలినిండి మార్మ్రోయఁ దొడఁగె.

గీ. అంత సీతకుఁ గాపున్నయా సురసతులు
త్రుళ్ళిపడిలేచి యమ్మరుత్సూనుఁ జూచి
భీతిలుచు సీతడాసి యీ కోఁతి యెవఁడు
వనిత! యీ వనంబంతయుఁ బాడుసేసె.

ఉ. నిక్కముఁ జెప్పు కాని యొకనిన్ వధియింతు మటన్న యోసి; యీ
తక్కరి దైత్యమాయ విశదంబగు నేరికి; మీకె తెల్లమౌఁ
జక్కఁగ; సర్పపున్నడలు సర్పమెఱుంగునుగాక తెల్లమే
తక్కినవాని, కేనును నితం డెవఁడో యని బెగ్గడిల్లెదన్.

చ. అనిన నిశాటకాంతలు భయంపడి రావణునొద్ద కల్లన
జని దనుజేంద్ర! యెవ్వఁడొ వనాటుఁ డొకం డరుదెంచి యేవిధో
జనకజతోడఁ గొన్ని ప్రియసల్లపనంబుల వల్కి యావనం
మనవనమెల్ల నాశనమొనర్చె నవక్రపరాక్రమోద్ధతిన్.

గీ. ధరణిపుత్రియున్న యశోక తరువు తప్ప
తక్కువృక్షాదులెల్ల సాంతముగఁ దునిమె
నతఁడు రామ దూతయొ యేమొ యసురనాథ
చెచ్చెఱంబట్టి తెచ్చి శిక్షింపవలయు.

చ. అనవుఁడు నౌడుగీటుచు దశాస్యుఁడు భీకర విస్ఫులింగముల్
గనగనమంచు నేత్రములఁ గ్రమ్మఁగ నుద్ధత కోపదీప్తుఁడై
యెనుబదివేల రక్కసుల నేడ్తెఱశూరులఁ బాపమానిపై
కనిచినవారు ముద్గరశరాసనపట్టిస ఖడ్గపాణులై.

చ. పరువడి నగ్నిమీఁదికెగఁ బ్రాఁకు మిడుంగురుఁ బుర్వులట్లు నె
వ్వరమునవారు వాయుసుతుపైఁబడ నాతఁడు దీర్ఘవాలము
న్గిరగిరఁ ద్రిప్పి మేరుధరణీధర సన్నిభదేహుఁడౌచు నం
బరము ప్రతిధ్వనింప, దిగిభప్రచయంబు చలింప నార్చుచున్.

ఉత్సా: జయము జయము రామచంద్ర సత్యధర్మశీలికిన్
జయము జయము లక్ష్మణాఖ్య శౌర్యధైర్యరాశికిన్
జయము జయము సూర్యపుత్ర సత్కపీంద్రనేతకున్
జయము జయము సంతతంబు సర్వవానరాలికిన్.

చ. అనియిటు మాటిమాటికి మహార్భటి మీఱఁగ నార్చుచుండ న
ద్దనుజులు బెగ్గడిల్లియు సుదారబలంబునఁ బోరిరప్డు పా
వనియుఁ దదీయశీర్షముల వ్రక్కలు సేయుచు బల్ శతార సా
ధనమును బూనివాలమునఁ దత్పృతనాతతి నుగ్గుసేయుచున్.

చ. "పటుతర విక్రమాఢ్యులు నవారిత దోర్బలులైన పెక్కు మ
ర్కటులు భజింప శాత్రవవిరాముఁడు రాముఁడు వచ్చి దుర్మదో
ద్భటులగు మిమ్ముఁ జంపఁగలవాఁడ" ననందఱుఁ దల్లడిల్లి పె
ల్లటమటనేఁగి తద్విధిదశాస్యునితో నెఱిఁగింప నాతఁడున్.

చ. అనుపమ శౌర్యవిక్రముఁ బ్రహస్తకుమారకు జంబుమాలిఁ గ
న్గొనుచుఁ గుమార! నీకును మనోవరుఁ డైనను లొచ్చనంగ ని
వ్వనచరుఁ డెంత; నీవతనిఁ బట్టి వధింపుమటన్న వాఁడు వే
చని హనుమంతునిన్ నిశితశస్త్రచయంబులతోడఁ దాఁకినన్.

చ. హనుమయు నల్క ఱెక్కొన మహాశిల నొక్కటి కేలనెత్తి య
ద్దనుజునిమీఁద వ్రేయ క్షణదాచరవీరుఁడు నోటలేక దా
నిని దశశాత శస్త్రములనెట్టనఁ బిండియొనర్చె నంతలో
ఘనతర ధారుణీరుహముఁ గైకొని వాయుసుతుండు వైచినన్.

ఉ. ఆరజనీచరుండు నిశితాంబకపంక్తుల దాని వ్రచ్చి వి
స్తారకఠోరమార్గణవితానములన్ హనుమంతు నొంప న
మ్మారుతి వాలమార్చి; యువమార హితంబగు శక్తిమీఱ హుం
కారము నాచరించి పరిఘంబునఁ ద్రుంచె నిశాటుశీర్షమున్.

గీ. ఆవలఁ దక్కిన దైత్యసైన్యములఁ దునిమి
తోరణస్తంభమామీఁదఁ జేరెనంతఁ,
గాందిశీకులచే దశకంధరుండు
జంబుమాలిమ్రగ్గుట విని జాలిపడుచు.

క. అవిరళ సాహసధుర్యుల
వివిధప్రఖ్యాత శస్త్రవిద్యాచణులన్
జవయుతుల మంత్రిపుత్రుల
బవరము గావింపఁ బంచెఁ బంచినవారున్.

చ. పరిఘగదా వరశ్వధకృపాణశరాసన భిండివాల ము
ద్గరముఖశస్త్రముల్ గొనియఖండబలంబుదలిర్ప సైనికో
త్కరములఁ గొంచువచ్చిలయకాలనిభుండగు పావమాని పైఁ
గఱకుటలుంగమొత్తములఁ గాడఁగనేసిన నాతఁడుగ్రుఁడై.

ఉ. అమ్ములఁ ద్రుంచి శస్త్రనిచయమ్ములనెల్లఁ దొలంచి వైరికా
యమ్ముల వ్రక్కలించి గనయమ్ములఁ జించి యలంచి దుఃఖితో
యమ్ముల యామినీచరచయమ్ములముంచి తదీయ సర్వసై
న్యముల నుక్కడంచె వనయమ్ముల సన్మహిమం బెలర్పఁగన్.

గీ. ప్రళయభైరవుగతినిట్లు పరిఢవిల్లి
వాయుజుఁడు మంత్రిపుత్రసప్తకముఁ జంపి
సేనలననొంప హతశేషులైన యసురు
లెడఁద వెఱఁగొంది రావణుకడకుఁ బోయి.

గీ. సైవరానట్టి హనుమచేష్టలను దెలుపఁ
బడగఁ ద్రొక్కిన సర్పంబు పగిది నాతఁ
డలిగి; ప్రఘసదుర్ధరవిరూపాక్ష భాస
కర్ణయూపాక్షుల నేడు రాక్షసులఁ జూచి.

గీ. అసురవరులార! కపిమాత్రుఁడైన వాని
కిట్టిధైర్యసాహసము లెఁజేనిఁ గలవె
చూడ వానరమాత్రుండు గాఁడతండు
కాన వెసఁబట్టి తెండెట్టులైన నిటకు.

పంచ. అనిన్ సురేంద్రుఁడైన మిమ్ము నడ్డఁజాలఁడైన నన్
వనాటమాత్రుఁడంచు భావమందు పేక్ష సేయఁబో
కనంత సత్పరాక్రమంబు నత్యుదగ్ర ధైర్యమున్
బెనంగొనంగ విక్రమించి బీఱువోక పోరుఁడీ.

చ. అనవినివల్లెయంచుఁ జతురంగబలంబులఁగొంచు సర్వసా
ధనములఁబూని; తోరణపు స్తంభముపై విలయార్కకైవడిన్
దనరు మరుత్సుతుంగని మనంబున నాగ్రహమిన్ముడింప నా
హనుమ నెదిర్చి ఘోరవిశిఖాస్త్రములన్ దలఁగాడ నేసినన్.

చ. పవనసుతుండు భీతిలక వారిదవర్గము పెంపడంచు న
ప్పవనునివోలె నద్దనుజవర్గము పెంపడఁగించి, కొండపైఁ
బవిపడురీతి దుర్ధరునిపైఁ జటులోద్ధతి దూకినన్ మహా
రవము సెలంగనార్చుచు ధరంబడె నాతఁడు వీతజీవుఁడై.

గీ. అట్లు ధరణిఁ ద్రెళ్ళిన దుర్ధరాఖ్యుఁ జూచి
యలవిరూపాక్ష యూపాక్షు లలుక మెఱయ
నింగి కెగసిల్లి దర్పంబు నివ్వటిల్లఁ
బరిఘములఁ ద్రిప్పిగిరగిర వైచిరవుడు.

మ. ప్రళయార్క ప్రతిమప్రతాపుఁడయి శౌర్యస్ఫూర్తిదీపింపనో
జలసద్బాజవితానముల్ నెఱికికీశశ్రేష్ఠుఁడయ్యుర్వర
న్వ్రాలియింపన్ హతశేషులెద్ద ఱ మసెగ్గోపంబు రెట్టింపఁగా
విలసద్బాణ పరంపరల్ హనుమపై వేగంబు ప్రయోగించినన్.

గీ. తరుచరోత్తముడవ్వాని సరకుఁగొనక
వాలమునఁదున్నించి ముష్టిచేవారిఁ బొడువఁ
దల్లడిల్లుచు భూస్థలిఁ దెళ్ళిపడిరి
వజ్రధారానిపాత పర్వతములట్లు.

క. సేనాధీశుల నేవుర
మానక భంజించి హనుమ మారిమసంగన్
బూనినకైవడి నాపై
సేనానీకంబును ఱుము సేసెదు వేళ౯.

సీ. విటతాటముగఁబడ్డ వికృతాసు రౌఘంబు
వ్రక్కలై ధరఁబడ్డ రథచయంబుఁ,
గొండలగతిఁబడ్డ శుండాలతండంబుఁ
సాగిలంబడ్డ యశ్వవ్రజంబు,
వికలంబులైపడ్డ వివిధాస్త్రనికరంబుఁ
గుప్పలైపడ్డ పీనుఁగగణంబు
వడిఁగాల్వలైపాఱు బహురక్తనిచయంబు
భూరికబంధనముత్కరంబుఁ

గీ. గలిగి యారణావని భయంకరముగాఁగ
మకరతోరణమెక్క నమ్మర్కటేంద్రుఁ
డంత సేనానులేగు రాహవమునఁ
జేవసెడి మ్రగ్గుటాలించి రావణుండు.

మ. కుటిలభ్రూభ్రుకుటి దుర్నిరీక్ష్యుఁడగుచున్ గ్రోధానలజ్వాలలు
త్కటమై పర్వఁగ నక్షనందనుని బ్రోత్సాహించి యాదుష్టమ
ర్కటుఁబోకార్చి రమ్మటంచను పఁగిన్కం బేర్చి యాతండు స
ద్భటమాతంగ శతాంగరాజిఁగొని యుద్యన్మృధ సన్నద్ధుఁడై.

సీ. స్యందన సంఘట్టనాతిభారంబునఁ
బృథ్వీతలంబట్టె క్రిందికొఱఁగ
వాజిరింఖోద్ధూత బహుపరాగంబుచేఁ
గడలెల్లఁ జిమ్మచీకట్లుగ్రమ్మఁ
జటులధ్వజైకసంజనితవాతంబున
జీమూతనికరంబు చెదరిపాఱ
దోషాచరోత్కరభీషణారావంబు
రోదోంతరముల మార్మ్రోతలీనఁ
గీ. దేరిపైన మధ్యందినాదిత్యుకరణిఁ
బ్రజ్వరిల్లుచు మకరతోరణమ్మీఁదఁ
బ్రళయ కాలభైరవునట్లు వఱలుచున్న
హనుమఁగని నారిసారించు చరుకు దేర.

మ. కలఁగెన్ సప్తసముద్రముల్ కుధరసంఘాతంబు కంపించె ది
క్కులుఁ దూలెన్ గ్రహతారకావళులు సంక్షోభించె భూమ్యభ్రముల్
చలనంబందె రవీందుమండలము తేజంబేదె; ముల్లోకముల్
కలఁతంబొందె; భయంబునొందె సుమనఃకాండంబు డెందంబులన్.

ఉ. అంతన నంతవేగమున నక్షుఁడు ఫాలమునాటుభంగి న
త్యంత నిశాతబాణనివహంబుల మారుతిపైన వేయఁగా
స్వాంతమునందు భీతిలిక వానినణంచి మరుత్సుతుండు గ
ర్వాంత ఘనారవంబుగ తినార్చిన నక్షుఁడు శోణితాక్షుఁడై.

సీ. బలువింటికూరుపో వడిసేయునేరుపో
నెఱియుంప జాలుపో యెఱుఁగరాక
యురువర్షపాతమో యుల్కానిపాతమో
ఘనశస్త్రజాతమో కానరాక
పెనుతూపుమించులో యనలఁపుటంచులో
తెలిమించుసంచులో తెలియరాక
మినువాఁకఝాకయో స్తనితంపు సోకయో
నెఱినార్చు వీకయో యరయరాక.

గీ. మించి జృంభించి తూపుఁగీలించి వంచి
గుంచివడిఁగాంచి నారిసారించి కేళ
రించి కడువిక్రమించి కాఱించి నొంచె
నంచితపరిభాషా రేయునాంజనేయు.

గీ. అంతనాతని బలవిక్రమార్భటికిని
శస్త్రవిద్యా సముద్దండ చాతురికినిఁ
జండతరధైర్యసాహస సంపదకును
హరివరేణ్యుండు చాలనచ్చెరువుఁబొందె.

ఉ. అమ్మరో వీఁడు బాలుఁడని యుక్కటికమ్ముఁ దలంచియింక డెం
దమ్మున నేనుపేక్షను బొనర్పఁగఁబోలదు; వీనిధైర్య శౌ
ర్యమ్ములు వాసవాది విబుధావలికైన వెఱంగుఁగొల్పుఁ బో
యిమ్ముగ నిష్టవీనిఁ బొలియించెదగాకని నిశ్చితాత్ముఁడై.

మ. పిడుగుం బోలెడు ముష్టిఘాతమునఁ దబ్బింబొందఁ దద్వక్షము
న్నొబ్బెడువన్ వాఁడుజలింపశంజరసుతున్ నొప్పింపఁగాఁజొచ్చె న
ప్పుడు రౌద్రుండయి యాంజనేయుఁ డురంగంబుబట్టు పక్షీంద్రుకై
వడి వానిన్ వడిఁబట్టి విక్రమమెలర్పన్ నేలపైఁగొట్టినన్.

# సుందరకాండము

చ. వదనమునుండి నెత్తురుప్రవాహముభంగి స్రవింపనంగముల్
జెదరసురింగియుర్విఁ మగుడఁ జేవనువాఁ డెదిరింపఁగానదే
యదనని వాయుజుండడిచె నంతటవాఁడు రథంబునుంటి భూ
వదమునఁ ద్రెళ్లెనభ్రవినిపాతసముజ్జ్వలతారకైవడిన్.

గీ. భూరిబలధుర్యుఁడక్ష కుమారుఁడిట్టు
లనిలనందనుచే మ్రగ్గుటాలకించి
యధికచింతాకులస్వాంతుఁడగుచు దైత్య
నాథుఁడయ్యెడంగల మేఘనాథుఁజూచి;

క. నీవతిబలశాలివి ప్ర
జ్ఞావంతుఁడ వఖిలశస్త్రసన్నుతవిద్యా
కోవిదుఁడవు నీయెదుటన్
గ్రావాహితుఁడైన నిల్వఁగలఁడె కుమారా?

చ. అని మొనముజ్జగంబులొకటై యెదిరించిననైన వ్రేల్మిడిన్
దునుమఁగలట్టి నీలసదనూన పరాక్రమ విక్రమంబులే
మనివినుతింపవచ్చు, శలభావలికైవడిఁ ద్వచ్ఛరావలీ
ఘనశిఖికీలసర్వరిపుకాండము భస్మముకాదె పుత్రకా!

చ. ఎనుబదివేల రక్కసుల హీనబలాఢ్యుఁడు జంబుమాలియు
ద్ఘనదురు విక్రముల్ సచివనందనులేడ్వురు, సైన్యనాయకుల్,
ఘనరణరంగకోవిదులు శర్వరవీరు లిఁకెందఱెందఱో
యని మొనఁ జచ్చిరత్తరుచరాగ్రణి మార్కొనలేక యక్కటా!

ఉ. ఇందఱు నొక్కయెత్తు మఱి నీవొకరుం డొకయెత్తు, సంగరో
ర్విం దెగువొప్ప నీవయెసరేఁగఁదొడంగిన నెట్టిశూరులున్,
మ్రిందర నిల్వనేర్తురె? త్వరంజని యక్కపిఁ ద్రుంపు మన్న నా
నందమునొందివాఁ డసురనాథునకుం బ్రణమిల్లి గ్రక్కునన్;

మ. ఘనవాతోపమ వేగముల్ గల మహాగంధర్వయుగ్మమ్ముఁ బూ
న్చిన తేజంపురథంబు నెక్కి యనికిన్ విచ్చేయఁ దద్ఘోర ని
స్వనమాలించి సమీరసూతి నిజయోత్సాహంబునం బొంగి సిం
హనినాదంబొనరించె దిక్కరిసమూహంబుల్ ప్రకంపింపఁగన్;

గీ. అట్లువారిర్వురని మొనకరుగుదేర
వారి యుద్ధంబుఁ జూడ సంబరముతోడ
యక్షగంధర్వ సిద్ధసాధ్యాదులెల్ల
వచ్చిగొని నభః పథంబున నిలిచిరపుడు.

క. నిరుపమ పరాక్రమాఢ్యులు
గురుతేజశ్శౌర్యధనులకుంఠిత ధైర్యుల్;
హరివర్యుఁడసురవర్యుఁడు
దురమునఁ గోపంబుమై నెదుర్కొనిరంతన్.

గీ. దనుజనందనుఁడనిలనందనుని మీద
దారుణ నిశాతమార్గణోత్కరము లేసె
వానినెల్ల నివారించి పావమాని
గగనవీథికి గుప్పున నెగసెనపుడు;

సీ. కమనీయ తపనీయ సముదగ్రకోదండ
మింద్రాయుధమువోలె నెసకమెసఁగ,
జెలఁగి సారించు చెడుశింజనీదీప్తులు
శంపాలతలవోలె నింపుసూపఁ,
కరిబృంహితంబులు వరవాజిహేషలు
మేఘగర్జలవోలె మేళవింప,
ఫీఁకతో నెదిరించు సోఁకులమూఁకలు
వారిదంబులవోలెఁ బరిఢవిల్ల,

గీ. వేగకుప్పించి జృంభించి విక్రమించి
నారిసారించి యుల్లసామీరిమీఁదఁ
బృథుఁ శౌర్యంబెలర్ప నయ్యింద్రజిత్తు
చటుల శరవృష్టిఁగురిసె నాసమయమందు;

సీ. సముదీర్ణలాంగూల చాలనానిలమున
జీమూతనికరంబు చెదరిపాఱ,
ఘనఘనాఘననిభ కంఠస్వరంబున
సోఁకులమూఁకలు సొమ్మసిల్లఁ
జండకోపాటోప సంరక్తముఖదీప్తి
ప్రళయార్కబింబంబు పగిది మెఱయఁ
గనకాద్రిసంకాశ ఘనశరీరచ్ఛాయ
చిమ్మచీఁకటివోలెఁ గ్రమ్ముకొనఁగ,

గీ. మహితదోశ్శక్తి దశముఖాత్మజుఁడు వేయు
శరనిపాతంబు సుంతయుసరకుఁగొనక
నిజబలంబును శౌర్యంబు నివ్వటిల్ల
నగచరాగ్రణివెస మింటికెగసెనపుడు.

మ. తనబాణౌఘము నిర్జరాలికయినన్ ద్రాసాస్పదంబయ్యు న
య్యానిలప్రోద్భవుపట్ల వమ్మగుట కత్యాశ్చర్యుఁడై దైత్యనం
దనుఁడిబ్భంగి నితఁడజేయుఁడనుచున్భావించి యేకాగ్ర్య బు
ద్ధిని బ్రహ్మాస్త్రముపింటఁదొడ్గి విలసద్దీప్తిన్ బ్రయోగించినన్.

మ. వినువీధిన్ బెనుమంటలంటుకొనగా బిట్టేర్చెముల్లోకముల్;
మనమందెల్లరు బెగ్గడిల్ల నదిభూమ్యాకాశముల్ నిండి పె
ల్లనశుంభద్గతిఁబాఱుతెంచుచు మరుత్సంజాతు బంధింపగాఁ
బెనుపుం దేజము నేది వాయుజుఁడు పృథ్వింగూలె నిశ్చేష్టుఁడై.

గీ. అటులమూర్ఛిల్లి కొంతసేపటికిఁ దేఱి
యనిలసుతుఁడద్ది బ్రహ్మాస్త్రమగుటెఱింగి
బ్రహ్మ తనకుమున్నిచ్చిన వరముఁదలఁచి
దానిభజియింప బంధముల్ దలఁగెనపుడు.

మ. అటుబ్రహ్మాస్త్రవిముక్తిఁ గాంచియు జగత్ప్రాణాత్మసంజాతుఁ డు
త్కటదోర్దర్పదశాననుం గనఁగ నెంచు వేడ్కన్, భీరుసింహంబోలె న
చ్చటని శ్చేష్టతనుండ రావణతనూజాతుండు వీక్షించి ను
త్కటవర్యుండు మృతింపకుంటకె దనబ్రహ్మాస్త్రపాశంబు పొందుచున్.

గీ. సైనికులఁజూచి "యివ్వనేచరునిఁబట్టి
రాజసభకీడ్చి తె"మ్మన రభసవృత్తి
వారుఁబవనాత్మజుంబట్టి బాధపెట్టు
చలఁచుచు దశాస్యుముంగలనిలిపిరంత.

ఉ. మేలగుచందురాల పసమించెడుగోడలఁ బుగ్గరాలఁ బెం
పాలుఁబసిండిడాల్ సొగసుపట్టుతివాచులెసంగు రత్నకు
ట్టాలుఁగడానిపూఁతలు గడల్కొనఁగ్రాలఁగ, మంచిపట్టుసె
ఘాలును ముత్యపున్సరుల బారులమర్చిన యోగంబునన్.

సీ. చామరల్ వీచు నిర్జరసారసాక్షుల
కరకంకణంబులు ఘల్లురనఁగ,
నలరినాట్యము సేయు నప్సరఃకాంతల
పదకింకిణీరాజిధ్వనులమీన,
ఘనవిపంచులమీటు గంధర్వతరుణుల
గానముల్ చెవులకింపై వెలుఁగఁ,
బన్నీరుఁబుప్పొడిఁ బైఁజల్లులేమల
నీటునొయ్యారంబు నివ్వటిల్ల,

గీ. యక్షరాక్షస విద్యాధరాహి గరుడ
సిద్ధసాధ్యాంగనాశ్రేణి చెంతఁ గొల్వఁ
గమ్రగాంగేయ నవరత్నకలితమగుచు
నధిక తేజంబు మీఱు సింహాసనమున.

సీ. దశహస్తకన్యస్తతత కిరీటద్యుతుల్
గలయఁ దిక్కులనెల్లఁ గాంతిలింపఁ,
దనులిప్తమృగనాభి ఘనసారగంధంబు
వ్యాపించి సభనెల్లఁ బరిమళింపఁ,
గమనీయనవరత్న కాంచనహారముల్
పీనవక్షంబునఁ బెంపుసూప,
శతకోటిసంకాశ చంద్రహాసచ్ఛటల్
మెఱపుఁదీఁగలవోలె మెఱుఁగులీన,

గీ. శౌర్యగాంభీర్యధైర్య సుస్థైర్యమొప్పఁ
గ్రహసమూహముతోడి మార్తాండువగిదిఁ
గరము దేదీప్యమానుఁడై వఱలుచున్న
రావణునిఁ గాంచె నాజగత్ప్రాణసుతుఁడు.

గీ. కాంచి తద్రూప శౌర్యప్రకాశములకు
నతులసంపదకాశ్చర్యమంది, యవుర!
వీఁడు దైత్యుండు నఘవర్తి కాఁడ యేని
యీ ప్రపంచంబులన్నియు నేలఁడగడె!

గీ. అని విచారించుచున్న యాహనుమఁ గాంచి
దానవాధీశ్వరుండు డెందమ్మునందు
మంటఁబోసిన నెయివోలె మండిపడుచు
నచటఁ గూర్చుండినట్టి ప్రహస్తుఁ జూచి.

మ. ఎవఁడీవానరుఁ డేలయిచ్చటికిఁ దానేతెంచె, నేతెంచెఁ బో
యవనింబొల్పగు నస్మదీయవనమేలాచొచ్చె, వేచొచ్చెఁబో
చివురుంగొమ్మలఁ జెట్లనేలకడకన్ ఛేదించె, ఛేదించియుఁ గ
దివిజారాతుల నేలచంపె, నిజమున్ దెల్పంపఁ బ్రశ్నింపుఁడీ?

చ. అనినియమింపఁగావిని ప్రహస్తుఁడు వాయుకుమారుఁజూచి యో
వనచర! నీవెవండ విటవచ్చుటకుంగతమేమి? మావనిన్
దునిమితివేల? దానినటుదున్మియు దైత్యులఁజంపితేల క్రొ
న్ననవచియింపుమన్నఁ గపినాథుఁడు మేఘగభీరవాక్కులన్.

క. పవనునిసూనుఁడ, సన్నుత
రవికులజలధీందుఁడైన రామునిదూతన్,
రవిపుత్రునమాత్యుఁడ న
న్నవనిన్ హనుమంతుఁడందు రఖిలజనంబుల్.

గీ. ఇచ్చసీతను దర్శింపవచ్చినాఁడ,
దితిజవరుఁజూడ వనముఛేదించినాఁడ,
నాదురక్షకై యుద్ధమొనర్చినాఁడ,
ననునెదిర్చిన దైత్యులఁదునిమినాఁడ.

క. అని ప్రత్యుత్తరమిచ్చియు
ననిలతనూజాతుఁ డద్దశాననుదిక్కై
వినయము సద్బుద్ధియు నా
తనికిన్ బోధించు ఫణితిఁదగ నిట్లనియెన్.

ఉ. రాముఁడు సర్వపాతకవిరాముఁడు నిస్తుల శౌర్యసాహసో
ద్ధాముఁడు సూర్యవంశసముదంచిత వారిధిసోముఁడూర్జిత
స్థేముఁడు తత్సతీమణి పతివ్రత భూమికుమారిసుమ్ము! నీ
వేమతి తెచ్చికొన్నసతి; యియ్యదినమ్మును దానవేశ్వరా?

క. పరమ కులనాశనంబును
వరధర్మవిరుద్ధము నతిపాపావహమున్
పరదారాపహరణ మి
త్తెఱఁగునఁ జేయంగ నౌనె? దితిజాధీశా?

మ. సురవిద్యాధర సిద్ధకింపురుష రక్షోయక్షగంధర్వ కి
న్నర కాకోదర చారణప్రముఖ నానానిర్జర వ్యూహముల్
వరుసల్ గెల్చితి దివ్యవైభవమునన్ వర్ధిల్లితీవట్టి ని
ర్భర భాగ్యంబులనేల యిక్కరణి నార్పన్ జూతు దైత్యేశ్వరా?

ఉ. దానవశాసనంబునకు దైత్యకులాగ్రణి! యివ్విధాన నీ
తానలమున్ రగుల్కొలిపి యంతయు నాశము సేయనేల? స
న్మానితబుద్ధి నభ్భువనమాన్యను రామునకప్పగించి నీ
దానవవంశముల్ నిలిపి తద్దయు శంబున ధాత్రి నేలుమా?

చ. అరయక కేవలంబు మనుజాంగనయంచు మదిందలంచి యో
తరుణినినీవు కృత్రిమవిధానమునన్ గొనితెచ్చికొంటివో
పరువడినామె నీకులము భాగ్యమునార్చెడు మృత్యుదేవిగా
నెఱుఁగుము; వేగనామెఁ ద్యజియించి సుఖింపుము రాక్షసేశ్వరా!

ఉ. నీదగుభోగభాగ్యముల నిల్పఁగఁ గోరుదువేని యింక మ
ర్యాదగ నాసతీమణిని రామునకిచ్చి క్షమింపవేఁడు మ
త్యాదరశీలుఁ డార్త శరణాగత రక్షకుఁడమ్మహా మహుం
డాదశకంఠ! నీజడత నోర్చి ప్రోవఁగలాఁడు సత్కృపన్.

చ. ఘనతరవిక్రమాఢ్యుఁడవు కావున మానుషుఁడైన రాఘవా
వనిపతి యేమిచేయఁగలవాఁడని నీవుదలంతువేమొ? భూ
వినుత వరాక్రమాస్పదుఁడు విశ్రుతదోర్బలుఁ డాతఁడమ్మహా
త్ముని నదిరించి యుద్ధమున మానుజగంబులు నిల్వనేర్చునే?

సీ. ఆరాముఁ డాదినారాయుండన బన్న
ముంబడ్డ పరశురాముండు సాక్షి;
సరిలేనియాతని శౌర్యంబు నెఱిఁగింపఁ
జంద్రశేఖరు శరాసనము సాక్షి;
దనుజలక్షణమాత్ర దునుమాడఁగలఁడన్న
ఖరదూషణాది రాక్షసులు సాక్షి;
తన్మహత్వముఁ దెల్ప ధరణిమహాగ్రావ
మతివయైనట్టి యహల్యసాక్షి;
గీ. అతఁడు నీకన్న విక్రమోన్నతుఁడగంగఁ
బట్టినిను భంగపెట్టిన వాలిసాక్షి;
యతఁడు సద్వంశ్యుఁడననో దశాస్య! తత్ప్ర
శస్తకులకర్త యాకర్మసాక్షి సాక్షి.

చ. అనియిటు లెంతగా హితములాడిననైన మదాంధుఁడద్దశా
ననుఁడు తదీయసాధువచనంబుల నించుకయైనఁ జెవికిన్
గొనమికి వాయుసూతి వెఱఁగుంబడి నిష్ఠురవృత్తిఁ గాక యీ
దనుజుఁడు సామవాక్యముల దారికి రాఁడని నిశ్చితాత్ముఁడై.

ఉ. నీవిభవంబుఁ గోరి రజనీచరనాథ! మహాప్రియంబునన్
నావచియించినట్టి వచనంబులు బూడిదలోహోమంబు పూ
రావలి నోసినట్లు వృథమయ్యెనహో! విబుధుల్ "వినాశకా
లే విపరీతబుద్ధి" యని లెస్సగఁ బల్కెడువాక్కు తప్పునే!

చ. చెడఁదగుకాలమింకఁ గడుజేరువయయ్యెను నీకుఁ గాని చోఁ
బుడమిఁ బులస్త్య వంశమునఁ బుట్టి పురారికి భక్తవర్యుఁడై
యుడుగక సర్వనిర్జరుల నోర్చి త్రిలోకరమాధిపత్యముం
బడసిన నీకు నిట్టి కలుషంపుబుద్ధులు పుట్టనేర్చునే!

శా. ఓరీ! నేనిపుడెన్ని చెప్పినను నీయుద్వృత్తి యేకాని మ
త్సారోక్తుల్ వినవ, వల్లరాఘవ బృహన్నారాచవర్గంబు లం
కారాజ్యంబున దైత్యవంశకదళీకాంతార విచ్ఛేదమున్
హోరాహోరిగఁ జేయునాఁడయిన నీవూహింతు తథ్యంబుగన్.

శా. చండాటోపు లనేకమర్కటులు రోషస్ఫూర్తితోఁ బోరఁ గో
దండంబున్ ధరియించి యూర్జితబలోదారుండు శ్రీరామభూ
వుండు దేశము మీఱి నీదశశిరంబుల్ దుంచుచున్నప్పు డె
వ్వండున్ నీమొఱలాలకింపఁడు మదిన్ భావింపు దైత్యేశ్వరా!

చ. అనిపలుకన్ దదీయవచనాజ్యముఁ జేసి దశాననక్రుధా
ఘనతరవహ్ని రాలుకొని క్రన్ననమండఁగ నాతఁ "డింక ని
వ్వనచరుఁ గానరంబడఁగఁ బట్టి వెసన్ వధియింపు" మంచుఁ బం
పిన గుణభూషణుండగు విభీషణుఁ డాతనితోడ నిట్లనెన్.

ఉ. దూతగవచ్చినట్టి కపిఁ దుంచుట న్యాయమె? నిక్కువంబుగా
నీతఁడవధ్యుఁ డన్న! శమియింపుము; త్రుంచుట కన్నమున్ గశా
ఘాతము ముండనంబు దన కర్తనమంకము యుక్త దండముల్
దూతయవధ్యుఁడంచు సుమతుల్ వచియింతురు దానవాగ్రణీ!

చ. అనివినయంబునం బలికి నట్టివిభీషణు నీతులన్ దశా
ననుఁడు సమాదరించుచు వనాటునకున్ దల వాల మెంతయో
ననుఁగవుఁ గాన నియ్యగచరాధము వాలముఁ గాల్చి యిప్పురం
బునఁ గలయంగఁ ద్రిప్పుడన మోదమునొందుచు యామినీచరుల్;

గీ. వాయునందనుఁ గొనిపోయి వాలమునకు
వలువలం జుట్టి నూనెలోపలను నాన్చి
చిచ్చుఁ దగిలించి రగిలించి రచ్చలుపుగఁ
బావకజ్వాలలభ్రంబు వగపు నగయు;

గీ. అంత నుగ్రుఁడై గంధవాహాత్మజుండు
ప్రళయకాలార్కుఁడై వడిఁ బ్రజ్వరిల్లి
యమునిదండంబుఁబోని వాలమును ద్రిప్పి
చచటి దైత్యులఁ బరిమార్ప నడరుచుండ;

చ. నిరుపమభీకరాకృతులు నిష్ఠురదేహులనేక దైత్యుల
య్యురుచరుఁ జుట్టుముట్టి పెనుతాళ్ళఁ గట్టి మృదంగమడ్డు ఝ
ర్ఝరపటహాదివాద్య నికరంబుల వేయుచు బొబ్బపెట్టుచున్
బరువడిఁ ధిక్కరించుచును వాడలఁ ద్రోవలఁ ద్రిప్పుచుండఁగన్.

ఉ. ఆతనిపాటుఁ గన్గొని నిశాటులు కొందఱు వేగ యేఁగి భూ
జాతకు నయ్యుదంతమును సాంతముగా వివరింప నామె వ
జ్రాతత ధారదుళ్లిన మహానగమట్టుల సొమ్మసిల్లియు
జ్జేతమునందుఁ బావకుని నిల్పి కడుంగడు భక్తిమీఱఁగన్

ఉ. ఏన పతివ్రతామణిన యేని రఘూద్వహుపాదపంకజ
ధ్యానము భక్తితోడ సతతంబును సేయుదునేని యాతఁడం
భోనిధిదాఁటివచ్చినను బ్రోచుటనిక్కము యేని యిన్నరు
త్సూనునకగ్నికీలలను సోఁకఁగ నీకు మహావ్యవాహనా?

చ. అనియటు జాతవేదసునిఁ బ్రార్థన సేయ మరుత్తనూజు తోఁ
కను దహియించు వహ్ని శశికైవడిఁ దోఁచె చల్లనయ్యె; న
ట్లనలము శీతలంబగుట కచ్చెరువొందుచుఁ బావమాని రా
మునిమహిమంబటంచు మదిఁ బొంగుచు నాతని సన్నుతించుచున్.

గీ. దైత్యసంబద్ధ కఠినబంధంబులెల్లఁ
ద్రెంచికొనిపోవనెంచి కుప్పించిమించి
సూక్ష్మగాత్రుఁడై బంధముల్ పారదినూడ్చి
యాపయిని మేరుసంకాశరూపుఁడగుచు.

గీ. అనలుఁడిత్తఱినాకుఁ దోడయ్యెఁగాన
నమ్మహాత్ముని కేనుఁ బ్రియంబెలర్ప
నిపుడ లంకానివాసులగృహములెల్ల
నాహుతులుగా సమర్పింతునని తలంచి

ఉ. ఒక్కొకయింటిపై కెగిరి యుప్పరమందు ఛటచ్ఛటధ్వనుల్
పిక్కటిలంగఁ జిచ్చుఁదవిలించి రగిల్చి కృశానుకీలనల్
దిక్కులఁ బర్వనభ్రమునఁదిర్గు సమస్తపతంగ జాతముల్
సుక్కుచుఁగూలఁగా దురవలోకన భీకరవహ్ని రాల్చుచున్.

సీ. రమణీయ శశి శిలాప్రాసాదములఁ గాల్చి
తపనీయ రుచిరసౌధముల నేర్చి;
నవరత్నఖచిత దివ్యవిమానములఁజూడి
మంటపంబులను భస్మంబొనర్చి
వరధాన్యశాలల వహ్నికాహుతిసేసి
మంచి హజారముల్ మంటఁగలిపి
భూరిచిత్రంబుల బూడిదఁగావించి
యఖిలవస్త్వాకరంబగ్నిఁద్రోచి

గీ. ప్రళయకాలాగ్ని పగిదిని వసఁగి
మహితలంకాపురంబెల్ల మసియొనర్పఁ
దన్నివాసులుల్లంబులఁ దల్లడిల్లి
యపుడు కర్తవ్యమేదియు నరయలేక.

ఉ. కేవలకీశుఁడే యితఁడు కేశవుఁడో హరుఁడో పితామహుం
డోవిధుఁడో పరేతవిభుఁడో సురనాథుఁడొ వారినాథుఁడో
పావకుఁడో సమీరణుఁడొ వారిజమిత్రుఁడొ లేక మృత్యువి
ట్లైవడిఁగీశరూపమునుఁ గైకొని దైత్యులఁ దున్మవచ్చెనో

క. అని పరిపరి విధముల యో
జన సేయుచుఁ దల్లడిలుచు జడియుచుఁ దామెం

దును నిల్వంజాలక గొ
బ్బున నిట్టట్టుఁ బరుగెత్త మొదలిడిరంతన్.

సీ. సకలాంగములు కాలి సదమదమగువారు
నడలేక గొల్లున నేడ్చువారుఁ
గాలు చుట్టునఁ గాల గంతువేసెడువారు
నటిమఁటినగ్నులై యుఱుకువారు
వహ్ని గీలలఁబడి భస్మమయ్యెడువారుఁ
బ్రిమసి భయార్తులై పాఱువారుఁ
గాపాడుమని యొండొకళ్ళఁ జీరెడువారు
నిల్లువెల్వడలేక యీల్గువారు

గీ. నగ్గిలోఁబడి బొగ్గైన హరులుఁగరులు
భస్మమైనట్టి వస్త్రాది వస్తుతతులుఁ
గలిగి కార్చిచ్చు దవిలిన గహనమట్లు
లంకయంతయుఁ బాడటి పొంక మేది?

గీ. అపుడు బలసాహసాఢ్యులౌన సురవరులు
ముసలముద్గరాద్యాయుధంబుల ధరించి
కట్టలుకమీఱఁగాడుపు పట్టినెదుర
నతఁడు వారినందఱఁబట్టి హత మొనర్చె.

ఉ. భూనుత సర్వపట్టణ సమూహములందును మేటియైన లం
కానగరంబు నిట్లుకడఁకన్; జ్వలనాహుతిఁ జేసి యమ్మరు
త్సూనుఁడు దైత్యరాజ్యమద ధూర్వహవృత్తి యడంగెనంచు నెం
తేనియెలర్చి వాలశిఖఁదిన్నగ నంబుధినార్చి యావయిన్.

గీ. కాలుటగ్గిని బొగ్గైనకాడుపోలెఁ
గాలిభస్మమైయున్న లంకాపురంబుఁ
గాంచి జానకిఁదలపోసి కలఁతపడుచుఁ
బాపమునకొడిమాలంబు కోపమకట.

ఉ. వ్యోమముదాఁక నంటుకొనియుండిన ఘోరతరాగ్ని హేతిచే
నీమెయి నెల్ల గేహములు వృక్షమృగాదులు భస్మమయ్యె నా
భూమిజ కేమి దుర్దశలు పుట్టెనొ? కీశులపాలికక్కటా
యేమనిపోదు రాఘవున కేమని నేనిఁక విన్నవించుదున్.

గీ. అని విచారించి యూరకిట్లడల నేల
రామభక్తుండనగు నన్ను ప్రేమఁ దలఁచి
యీజగత్ప్రాణసఖుఁడు తా నేఁచ లేఁడ;
రాముపత్నిఁ బతివ్రత నేమి సేయు.

క. అని మదిగుదుర్చుకొని వేచని జానకిపాద సారసంబులకున్ వం
దన మొనరించి నిలంబడి తనదగు చరితంబు నెల్లఁ దప్పక తెలిపెన్.

చ. తెలుపఁగ సీత యాతఁడతి తీవ్రతరార్చికి లోను గాక ని
శ్చలగతి వచ్చినందులకు సంతస మొంది మరుత్తనూజ! నీ
వలయక యేఁగి నాదొసఁగులన్నియుఁ దెల్పి రఘుక్షితీంద్రు నిం
దులకుఁ గపీంద్రసైన్యములతో వెసఁ దోడ్కొనిరమ్ము వేఁడెదన్.

చ. అనవిని తల్లినివ్వుపడు నాపదలన్నియు దెల్పి రాఘవా
వనివిభులక్ష్మణున్ రవిజు భల్లుకనాథుఁ గపీశవాహినిన్
గొనిచనుదెంతు; రావణునిఁ గూల్చి జగంబులు మెచ్చ రాముఁడు
న్నినుఁ గొనిపోవుఁ జిత్తమున నెవ్వగ మానుము పోయి వచ్చెదన్.

క. అని తెల్లంబుగఁ బలికి పవనపుత్రుఁడు రామభద్రపదపద్మంబుల్
మనమున భజించి భూనందనచే వీడ్కోలుఁ బడసి తరణోన్ముఖుఁడై.

మ. వితతానేక వసుంధరారుహ సమన్వితంబు; మాద్యన్మృగేం
ద్రేతర క్షుద్ద్విరదాది భీకరము గోదగ్రంబు; సుత్తుంగ శృం
గతతి వ్యాప్తము నైన యొక్క యచలక్ష్మాధ్రంబుపై నెక్కి యా
ద్భుత మోదంబున నుత్తరాభిముఖుఁడై పోనెంచి యాముందటన్.

శా. రంగత్తుంగతరంగ హస్తములఁ దోరంబైన సంతోసము
ప్పొంగం భీర ఘనాఘ్నసంజసనుతున్ వారాశి నహ్వాన మొ

య్యంగావించుచు నున్నవాఁడో యనఁ బారావారమంతేసి యు
ప్పొంగంగాంచి మరుత్సుతుండు పరమామోదైక చేతస్కుఁడై.

సీ. వడినూనికుప్పించు పదఘట్టనం జేసి
వసుధాధరంబు లోపలికిఁగ్రుంగ;
నాకాశమునఁబాఱు నధిక వేగంబున
బ్రహ్మాండమెల్లఁ గంపంబునొందఁ;
జెలగిఁ కేకలువేయు సింహనాదంబున
విపినజంతువులట్టె బెదరి పాఱ
భర్మాద్రిసంకాశ భైరవాకృతిఁగాంచి
కమఠనక్రౌఘముల్ కంధినడఁగ;

గీ. జటులవాలవిక్షేప సంజాతవాత
వేగమున మహాభూజముల్ విరిగికూలఁ
బృధురయంబునఁ దండ్రిపేర్చిలుచునట్టు
యుప్పరంబున విచ్చేయుచుండునపుడు.

చ. తరుచరవీరు సింహనినదంబును జాంబవదంగదాది వా
నరవరులెల్లరున్ విని మనంబున మోదమునొంది భూరుహో
త్కరములనెక్కియున్ గిరివితానములెక్కియుఁ జూచుచుండ నే
డ్తెఱవడిఁ బావమానిపఱతెంచి మహేంద్రముమీఁద వ్రాలినన.

గీ. అలసరాక వేచుచున్న యంగదాది
మర్కటాగ్రేసరులు ప్రణామంబులిడుచు,
గానుకలందీయఁ గైకొని గాలిపట్టి
వారలంపటిచేత సత్కారమొంది.

గీ. కంటిఁగంటిని కన్నులకఱవుదీఱ
వాలుఁగంటులలోన మేల్బంతియైన
యవనిపుత్రిని రామునర్ధాంగిఁగంటి
నుల్లసంబునఁగంటి మిమ్మెల్లఁగంటి.

క. అని సీతవార్తఁ దెల్పఁగ వనచరవరులెల్ల హర్షపరవశులై యా
తనివృత్తాంతంబంతయు వినఁగా డెందంబులందు వేడ్కఁదలిర్పన్

చ. తరుచరవీర! నీవెటులఁ దాఁటితివంబుధి నెట్టులంకలోఁ
జొఱఁబడి తెట్లు జానకినిఁ జూచితి వాయమ యేమిచెప్పె, నే
సరణిని నందు భీకరనిశాటుల బారికిఁ దప్పివచ్చితీ
తెఱఁగఖిలంబు మాకిపుడు తెల్పఁగ వేఁడెదమన్న నాతఁడున్.

చ. వననిధి దాఁటుటల్ సురసభామినిఁ గెల్చుట సింహికాసురన్
దునుముట లంకఁ జొచ్చుట వధూమణి జానకిఁ గాంచి పల్కుటల్
వనమును ద్రుంచుటల్ దనుజవర్గముఁ జంపి దశాస్యుఁ దూఱుటల్
పెనుపఱలంక నగ్ని దవిలించుట లాదిగ విస్తరించినన్

గీ. వారలెల్లరు సంతోషభరితహృత్స
రోజులై చెలంగుచు భూరిరుచిరపుష్ప
ఫలసమృద్ధంబు దధిముఖపాలితంబు
నైన సుగ్రీవు మధువనమందుఁ జొచ్చి,

ఉ. పమ్మిన వేడ్క నిట్టునటుఁ బాఱుచు దూఁకుచుఁ గేకరించుచున్
గొమ్మల నార్చుచున్ బఱుగుఁ గొమ్మలఁ జేతులఁ బట్టి వ్రేలుచున్
గమ్మని పండ్లు దించుఁ గుతుకంబున నచ్చపుఁ దేనెలానుచున్
గ్రిమ్మఱ శాఖ లెక్కుచును గాయలు డుల్చుచుఁ బూలు రాల్చుచున్

పంచ. మావిపన్నల లేఁజిగుళ్లను మంజరీతతిఁ ద్రుంచుచున్
దీవెఁగ్రొంబొదలెల్లఁ ద్రుమ్ముచుఁ దెల్లమొగ్గల గిల్లుచున్
పావనంబగు జానకీసతి బాగెఱింగిన మోదమున్
భావమందునఁ బట్టఁజాలక పాడు సేయుచునుండఁగన్

క. వనపాలకు లాహాఁ వడిఁ
గనుఁగొని క్రోధంబు మీఱఁ గపులన లంపన్
హనుమంతుఁడు వారలఁ బె
ల్చనఁ దాఁకియుఁ గఱపియుఁ జఱచియు నలఁచెన్

చ. అలఁపఁగ నేడ్చుచున్ దధిముఖాఖ్యునిపాలికి వారలేఁగి కీ
శులు వనమెల్లఁ ద్రుంచి తముఁ ద్రొక్కఁగ మోదిన దుష్టవర్తనల్
దెలుప నతండు కిన్కనరుదెంచి వనాటులఁ గొట్టె నంతటన్
వలఁగొని వారు మేఁజిదియ బాదిరి, బాదినవాఁడు ఖిన్నుఁడై

కీ. రామలక్ష్మణ సహితుఁడౌ రవికుమారు
వద్దకేతెంచి కడు దీనవదనుఁడగుచుఁ
గరయుగంబుల మోడ్చి మూపురకు మ్రొక్కి
యనిలజాది మర్కటుల దౌష్ట్యంబుఁ దెలిపె

గీ. తెలుప హనుమంతు విజయంబుఁ దెలిసి కపిజుఁ
డతని నూరార్చి నీవిఁక నరుగుదెంచి
వారిఁ దోడ్కొని రమ్మనవాఁడు నరిగి
క్రోఁతిగములకవ్వార్త వాక్రుచ్చెనంత

చ. వనచరులెల్ల నుల్లములఁ బొంగియు లేచి కుతూహలంబునన్
దనరుచు రామలక్ష్మణపతంగకుమారులపాలికేఁగి వం
దన మొనరించి జానకియుదంతమునంతయుఁ దెల్ప వాయునం
దనునిఁ బురస్కరింపఁగ నతండును భక్తినతాఖిలాంగుఁడై

చ. గొనకొని లంకలోనఁ గనుఁగొంటిని జానకి నామె రాక్షసీ
వనితలచేత బెట్టెడవు బాధలనొందుచు శోకబాష్పముల్
పెనుసెలయేళ్ళ భంగిని స్రవింపఁగ నేడ్చుచు; మాటిమాటికి
న్మనమునఁ దావకాంఘ్రి నలినస్మరణంబొనరించు రాఘవా!

సీ. జలధరసంఛన్న చంద్రబింబము మాడ్కి
వదనారవిందంబు వన్నెతఱుగ,
నివురుగప్పినయట్టి నిప్పుకయుంబోలెఁ
గమ్రశరీరప్రకాశమెడయ,
నీహారకణసిక్త నీరేజములభంగి
నశ్రుసంప్రక్తమై యక్షులొప్ప,

వడగాలిచే వాడుబాఱినలతరీతి
జానకిమేను కార్శ్యమువహింప

గీ. వగచుచేశ వేణియు నుపవాసకృశయు,
గతినభూశయనయు నోచుఁ గళవళముఁగ
దావకీనసందర్శనార్థంబునిచ్చ
చింతనొందుచున్నది క్షితితలేంద్ర!

గీ. అంతమీఱు సుగ్రీవసఖ్యంబుఁ జేయు
టలును మీఱుగుణాలక్షణంబులును నేను
దెలిపి మీఱిచ్చినట్టి ముద్రికనొసంగ
మిముఁగనినయట్లు దానినంకమునఁ జేర్చి.

ఉ. ఘోరుననేడ్చుచుండఁగని పొల్పుగనేనపుడూఱడింపఁగా
దేఱియెలుంగు రాలుపడదీనముఖంబునఁ జిత్రకూట మం
దీరుచరించుచుంట, పరభృద్దనుజుండొకఁ దత్కుచాగ్రముం
జీఱుటమీఱుత్రుంచుటయుఁ జెచ్చెఱ నస్త్రియొనర్పఁ బల్కియున్.

గీ. లక్ష్మణార్కజాదుల కుశలంబునడిగె
రెన్నెలలదాఁకను సురుభరింతునెట్లొ
యవలక్ష్మణమైన జీవింపననియె మిమ్ము
నరగఁ దోడ్కొనిరమ్మని సారెబలికె.

క. మఱిమీకు నానవాలుగఁ
జెఱఁగున బిగఁగట్టినట్టి చింతామణి సా
దరమతి నిచ్చెననుచు వి
స్తరగుణసాంద్రునకు రామచంద్రునకొసఁగన్.

గీ. అతఁడు జానకీదేవిఁగన్నట్లుదాని
నక్కునంజేర్చి శోకింపనతనిఁగాంచి
లక్ష్మణుఁడు నేడ్వఁ గీశవల్లభులు వారి
నెంతొయోదార్ప (శ్రీ)రాముఁడిట్టులనియె.



చ. అనిలజ! సీతనాకనులకట్టె కనంబడుచున్న దాలస
ద్వనజదలాక్షి రెన్నెలలదాఁక నెటోమనియుందునంచుఁ దా
ననిమెనుగాని నేనుక్షణమైనవసింపఁగఁ జాలఁగావునన్
ననుఁగొనిపోయి శీఘ్రముగ నాదగుజానకిదండఁజేర్చుమా!

చ. అని విలపించు దాశరథి నప్పవనాత్మజుఁడూఱడించి వా
ర్ధిని వెసదాఁటి రావణువధించి ధరాసుతఁ గొంచు తేరఁగాఁ
జనవలెనంచు విన్నపముసల్పి, సముద్రముదాఁటుటాదిగాఁ
దనచరితంబుఁదెల్పఁ బ్రమదంబడె రాముఁడు నెమ్మనంబునన్.

మ. జలజాతాసన నీలకంధరతురాషాట్ప్రాశ హస్తాంతక
జ్వలన శ్రీదసమీరణాదిక మహాబర్హిర్ముఖానీక మం
జులచామీకర విస్ఫురన్మకుట తేజోరత్న మాణిక్య ని
స్తులనీరాజిత పాదపద్మయుగళా! స్తుత్యప్రభావర్గళా!

పృథ్వీ! అమర్త్యగణసన్నుతా! యనుపమప్రభావోన్నతా!
సమస్తగుణరాజితా! సకలలోక సంపూజితా!
సముగ్రఖిలమోచనా! సమధికస్ఫురల్లోచనా!
సమంచితసుభాషణా! సతతభక్తసంపోషణా!

గద్యము.

ఇతి శ్రీహయగ్రీవ కరుణాకటాక్షవీక్షణ ప్రసాదలబ్ధ తిరుమల
వింజమూరు వంశోదారక్షీరపారావార రాకాకైరవమిత్ర!
పవిత్ర కౌశికగోత్రాపస్తంభసూత్ర! కృష్ణమా
చార్యపుత్ర! సకలసుకవిజనవిధేయ పార్థ
సారథినామధేయప్రణీతంబైననిర్వ
చన సుందరకాండము సర్వం
బును సంపూర్ణము.

ఓం తత్సత్! ఓం తత్సత్!! ఓం తత్సత్!!!